సర్వస్వామ్యములు గ్రంథకర్తవి



ప్రతులు ౫౧౦




ప్రథమ ముద్రణము

తారణ వసంతము

౩౦. ౩. ౧౯౪౪.




వెల రు. ౧-౦-౧




శేమసాగర ముద్రణాలయము,

హైదరాబాదు.

# INTRODUCTION

## TO

# ALANKARA VASANTA

I have great pleasure in introducing to the cultured public this book on Alankaras 'Alankara Vasanta' from the pen of Siromani Sriman Ch. Rangacharyulu garu. The author is already familiar to the readers of Telugu through his devotional drama 'Halikudu'; more recently Sriman Rangacharyulu garu has done a service to the students of Sanskrit poetics by translating the 'Pratapa rudra Yashobhushana' of Vidyanatha into Telugu which I hope will be before the scholarly public presently. His Alankara Vasanta is a book of illustration of the various figures of speech which were enumerated by Indian rhetoricians. The illustrations which Sriman Rangacharyulu garu gives are all of his composition and display a noteworthy felicity in poetic expression. The chief feature of the work is that the life of the great hero Lord Sri Rama is the subject of illustration which is in accordance with the ancient dictum

" उपश्लोक्यस्य माहात्म्यात् उज्ज्वलाः काव्यसम्पदः "

(a Kavya attains perfection by the nobility of the hero whose life it deals with). It is in pursuance of this that Andhra writers on poetics like Vidyanatha of Warangal and Vinnakota Peddana of Rajmundry chose the lives of their

Royal patrons for illustrating their poetic theories. Where others adopted the lives of earthly heroes for examples the present writer, true to his devotional outlook draws upon the perennial fountain of Lord Sri Rama's life.

A book of this kind is also well in need from the point of the lay reader and the young scholar, for books written in Sanskrit on Alankaras are not within their easy reach. Even Telugu works on poetics like Kavyalankara Chudamani and Narasabhupaliyamu leave the ordinary reader bewildered in understanding them. The method adopted in Alankara Vasanta has the merit of clearness and brevity. The definition is concluded in simple terms, the illustration is given in winning poetry and the whole is explained in easy prose. The writer did well in my opinion in passing over the minute subtleties and ramifications of the figures of speech as perfected by our ancient writers on poetics and he selected the main outlines of these poetic embellishments. In classifying the Alankaras he seems to have followed the principles laid down by eminent Audhra writers like Vidyanatha Panditaraja Jagannatha and Varanasi Dharma Suri. I heartily congratulate Sriman Rangacharyulu garu on his scholarly undertaking

A few words on the theory and practice of Alankaras and their hold on Indian poetry may not be out of place. Alankaras are figures of speech; they are poetic embellishments. By their very name they have their origin in ordinary speech. As poetry is beautified speech these Alankaras came to play an important role in poetic utterance. Even in the Vedas which are simple yet profound utterances an occasional simile or metaphor crept in into the spontaneous

poetry of the Vedic Rishis. By the time of Bharata Muni. the reputed author of Natya Shastra the figures of speech came to be recognised as such, as sources of charm to poetic composition. Bharata Muni enumerated only four such figures of speech the simile, metaphor and some kind of alliteration, a perfectly simple and natural classification. Even Western writers on rhetorics recognise these figures of speech. They do seem to employ many more though the subject of Alankaras was not elaborated amongst them with the through-ness characteristic of the Indian mind. Now between Bharata Muni and writers on poetics like Dandi and Bhamaha the number of these figures of speech rose to thirty six. And it grew by leaps and bounds so that the 17th century rhetoricians enlisted nearly 115 Alankaras. How did this extraordinary development take place. Surely the speech of men did not become more poetic than what it was in its ruder ages. It became rather prosaic and laboured. Therefore we can account for this rise in the number of Alankaras only by attributing it to the ingenuity of our writers on poetics. This fact was long ago recognised and some of the more critical minds among our rhetoricians tried to analyse the innumerable Alankaras into well defined categories. In fact one of the shrewdest among them Appayadikshita of the 17th century observed that only one Alankara, the Upama (simile) plays different roles in the whole world of Alankaras just as a clever actor assumes various poses. And he seems to be nearest to truth.

It may also be noted that the present day taste is against the multiplication of the figures of speech. All

modern critics agree with our Dhvani School of poetry in assigning the Alankaras a subordinate role in the scheme of poetic art. They may help to beautify poetry when judiciously employed. Sriman Siromani Rangacharyulu garu has done a service in bringing the more prominent of these figures of speech to the Ken of the ordinary reader.

I wish all success to his book, Alankara Vasanta.

K. LAKSHMI RANJANAM, M. A.
LECTURER IN TELUGU,
*Osmania University.*

# మనవి

విజ్ఞాన వర్ధనీ పరిషత్పక్షమున ఈ అలంకార వసంతమును ఆంధ్రలోకమునకు సమర్పించు కొనుచున్నాము. ఇది మా పరిషత్సభ్యులకు శిరోమణి శ్రీ చలమచర్ల రంగాచార్యులవారిచే రచింపఁబడినది. పరిషత్సమావేశమున శ్రీ ఆచార్యులవారు తమ గ్రంథమును జదివి వినిపించిరి. సభ్యుల యామోదాభిలాషలచే ఈ యుత్తమ కృతిని పరిషద్గ్రంథావళి చతుర్థ గ్రంథముగా ప్రకటించుకొను గౌరవమును నేము పొందుచున్నాము. అలంకార జిజ్ఞాసువులకు ఈ గ్రంథ మెంతయు నుపకరించును. తమ యీ గ్రంథమును పరిషత్పక్షమున ప్రకటింప సమ్మతించిన శ్రీ కవిగారికిని, గ్రంథమును విని యామోదించి ప్రకాశింపఁజేసి తమ యుత్తమ సారస్వతాభిరుచిని ప్రకటించిన శ్రీ చించోడు గోపాలరెడ్డి దేశముఖుగారికిని హృదయ పూర్వకమగు మా కృతజ్ఞతను వెల్లడించుచున్నాము.

హైదరాబాదు (దక్షిణ)
౨-౪-౧౯౪౪.

సురవరము ప్రతాపరెడ్డి
విజ్ఞానవర్ధనీ పరిషత్ కార్యదర్శి.

## కావ్యహేతువు

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసములు కావ్యమునకు హేతువులు. వీనిలో ప్రతిభ ముఖ్యము. ప్రతిభా హీనములగు కృతులు రాణింపవు.

## కావ్య స్వరూపము

'రమణీయమగు అర్థము నిచ్చునట్టి వాక్యము కావ్యము'

శబ్దము:- వాచకము, లక్షకము, వ్యంజకము అని మూడు విధములు.

అర్థము:- వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము అని మూడు తీరులు.

కావ్య జీవితము:- కావ్యమునకు ప్రాణమువంటిది వ్యంగ్యము. ఇదియే ధ్వని యనబడును.

గుణములు:- మనుష్యునకు శౌర్యదయాదులవలె రసవ్యంజకములగుచు కావ్యమునకు శోభను గలిగించునవి గుణములు. మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము, మొదలగునవి పదునాలుగు గుణములు.

రీతులు:- వైదర్భి, గౌడీ, పాంచాలి, యని ఆయా దేశీయుల అభిరుచినిబట్టి రచన మూడు విధములుగా విభాగింపబడినది.

వృత్తులు:- కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి యను వృత్తులు నాలుగు. ఇవి రసావస్థానమును సూచించును.

శయ్య:- పూలదండలో పూవులవలె అనురూపములగు పదములు ఒండొంటితోఁ జేరిన యా పొందికయే శయ్య.

పాకము:- అర్థ గాంభీర్యము పాకము. అర్థము సులువుగాఁ దోఁచుట, విలంబముగఁ దోఁచుట యను భేదమున నిది ద్రాక్షాపాకము, నారికేళ పాకము మొదలగు పేళ్లతో వ్యవహరింపఁబడును.

## అలంకారములు

శరీరమునకు నగలు అందమును పెంపుచేయునట్లు కావ్యమునకు అలంకారములు శోభాతిశయమును గూర్చును.

భాషతోనే యలంకారములు పుట్టినవనఁదగును. తాను చెప్పఁదలఁచిన విషయమును స్పష్టముగాను చక్కగాను శ్రోతకుఁ దెలియుటకు అలంకార యుతముగ భాషించుట వక్తకు స్వభావము. అట్లు నైసర్గికముగ నేర్పడి భాషలోఁ గలిసి యున్న పలుకుబడులనే కావ్య మీమాంసకులు వేఱు వేఱుగా నేరికూర్చి ఆయా అలంకారములుగా పేళ్ళు పెట్టి స్వరూపములను నిర్వచించిరి.

అలంకారముల సంఖ్య:- అలంకారములు క్రమముగఁ బెరుగుచు వచ్చినవి. భరతుఁడు శబ్దాలంకారములలో ఒక యమకమును, ఉపమ రూపకము దీపకములను మూఁడు అర్థాలంకారములను మాత్రము పేర్కొనెను. ఇట్లు అల్ప సంఖ్యతో ప్రారంభింపఁబడిన వీనిని దండి ౩౮; మమ్మటుఁడు ౫౮; విద్యానాథుఁడు ౬౬; జయదేవుఁడును అలంకారమణి హారకారుఁడును ౧౦౦: అప్పయ దీక్షితులు ౧౧౫ వఱకు బెంచిరి.

## అలంకార వసంతము

ఈ యలంకార వసంతమున మొత్తము ౯౦ అలంకారములు స్వరూపోదాహరణములతో సమన్వయింపఁబడినవి. అలంకారముల క్రమము స్వరూపము ముఖ్యముగ * వారణాసి ధర్మసూరి అలంకార రత్నాకరమును అనుసరించి నిర్ణయింపఁబడినవి. అందులేని కొన్ని యలంకారములు రసగంగాధరమునుండి గ్రహింపఁబడినవి. గ్రంథ విస్తృతి గాకుండుటకై అలంకారముల యవాంతర భేదములను వదలి ప్రధాన స్వరూపమే నిరూపింపఁబడినది.

కావ్యమీమాంస సంస్కృతములో అపారముగా జరిగినది. తెలుఁగులో కావ్యాలంకార చూడామణి, సరసభూపాలీ

---

*వారణాసి ధర్మసూరి ఆంధ్ర దేశమునందలి సంస్కృత విద్వత్కవి శేఖరులలో అఖండ యశము వార్జించిన మహనీయుఁడు. ఈ కవిచంద్రుఁడు క్రీ. ౧౫ శతాబ్దము నాఁటి వాఁడు. తెనాలి సమీపమున నున్న కసెపరము ఈతని జన్మస్థానము. ఈ విద్వత్కవీశ్వరుఁడు రచించిన కృతులివి:-

౧. కృష్ణస్తుతి ౨. సూర్య శతకము ౩ బాల భాగవతము ౪. హంస సందేశము (ప్రాకృతము) ౫. కంస వధ ౬. నరకాసుర విజయ వ్యాయోగము ౭. సాహిత్య రత్నాకరము. వీనిలో సాహిత్య రత్నాకరము పది తరంగముల గొప్ప యలంకార శాస్త్రగ్రంథము. ఇది కావ్య మీమాంసా జగతిలో ఆంధ్ర ప్రతిభకు నిదర్శనముగా నిలువఁ దగినది. ఈ కవి తల్లజాని గురించి సవిస్తరముగాఁ దెలియుటకు విమర్శకాగ్రేసరులగు శ్రీమాన్ తేవయుజ్ఞ వీరరాఘవాచార్యులు, ఎం. ఏ., గారి 'Dharmasuri-his date and works' అను ఆంగ్ల వ్యాసము చూడఁదగును.

– See New Indian Antiquary Vol. II, No. 7 pp. [illegible] Oct. 1939.

యము, ఆంధ్ర చంద్రాలోకము, +కువలయానంద ప్రకాశిక, అను ప్రాచీనములును, శ్రీ వీరేశలింగము పంతులుగారి అలంకార సంగ్రహము; శ్రీమాన్ ఇ. టి. శ్రీనివాసాచార్యులగారి సాహిత్య చింతామణి; శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి ఆంధ్ర సాహిత్య దర్పణము, శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి ఆంధ్ర దశరూపకము; శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ఆంధ్ర కావ్యాదర్శము; శ్రీ కాండూరి నరసింహా చార్యులగారి కావ్యప్రకాశ వివరణము; శ్రీ వెల్లాల సదాశివ శాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహము; శ్రీ కట్టమంచి రామ లింగారెడ్డిగారి కవిత్వ తత్త్వవిచారము; శ్రీ కురుగంటి సీతా రామయ్యగారి అలంకార తత్త్వము; శ్రీమాన్ శిరోమణి వేదాల తిరువేంగళాచార్యులగారి ఆంధ్ర కావ్యాలంకార సూత్రవృత్తి (వీరి ఆంధ్రధ్వన్యాలోకము అముద్రితము); శ్రీ జమ్ముల మడక మాధవ రామశర్మగారి నవరస గంగాధరము; శ్రీమాన్ రాఘవయ్యంగారి కావ్యాత్మ; నా 'ఆంధ్రప్రతాపరుద్ర యశో భూషణము' మొదలగు నవి కొన్ని యర్వాచీనములును కావ్య మీమాంసా గ్రంథములలోఁ బరిగణింపఁ బడునవి.

వీనిలో ఒండు రెండు తక్క తక్కినవన్నియు కావ్య సామగ్రియగు నాయక శబ్దార్థ రసగుణ దోషధ్వన్యలంకార ముల నెల్ల నిరూపించునవి. అలంకారములను మాత్రమే నిరూ పించునవి యరుదు. కావున అలంకార జిజ్ఞాసువుల కుపకరించు

---

+ ఈ గ్రంథము అముద్రితము. కటికనేని రామకవి రచితము. మిత్రులు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి, బి. ఏ., బి. ఎల్., గారి కడ నీని లిఖిత ప్రతి గలదు.

రీతిని ప్రాచీన నవ్యాలంకారముల సమన్వయరూపమున ప్రకృత గ్రంథము నిబద్ధింపఁబడినది. వర్ణ్యమహత్త్వ కూడ కావ్యమహత్త్వకు ప్రధాన కారణములలో నొకటియని యాలంకారికుల యభిమతము. కావున వాల్మీకి కాళిదాస భవభూతి భోజరాజాదులు ఆదరముతో తమ కావ్య వస్తువుగా స్వీకరించిన యభిరామమగు రామ వృత్తమే ఈ అలంకార వసంతమును బరిమళింపఁ జేసినది. గోపాలపేట నిజాం రాజ్యమున మహాబూబు నగర మండలములోని యొక ఆంధ్ర సంస్థానము. శ్రీరాణి రంగనాయకమ్మగారు ఈ సంస్థానమున కధీశ్వరులు. ఈ కృతిని ప్రకాశింపఁ జేసిన శ్రీ చించోడు గోపాలరెడ్డి దేశముఖుగారు ప్రధాన రాజ బంధువులు. వారి యభిమతానుసారము ఇందలి ప్రతి పద్యమును గోపాలపేట రామ నామాంకితము చేయఁబడినది. పురుషోత్తముఁడగు శ్రీరామచంద్రుని కీర్తి సురభిళమగు నా యీ యలంకార వసంతమును సహృదయ సోదరుల కరకమలములఁ బెట్టుచు

"కావ్యామృతాకలనయా మృదుశీతలాని
శ్రీరామ దివ్య యశసా సురభీకృతాని
యేషాం మనాంసి ఘనసార సమాని తేషాం
ఏషా కృతిర్వితనుతాం కమపి ప్రమోదమ్"

అని శ్రీధర్మసూరివలెనే నేనును ఆసించుచున్నాను.

ఈకృతిని వెలువడఁ జేసిన సహృదయులగు శ్రీ చించోడు గోపాలరెడ్డి దేశముఖుగారికిని విజ్ఞానవర్ధినీ పరిషత్తువారికిని కృతజ్ఞుఁడను.

తారణ వసంతము
శ్రీరామనవమి

చలమచర్ల రంగాచార్యులు,
గ్రంథకర్త.

# కృతి ప్రకాశక ప్రశంస

---

శ్రీమహిళా శిరోమణికిఁ జెన్నల రారెడుపాలవెల్లి; నా
ధీముదితామ తల్లికకు నృత్యకళా భవనంబు; కీర్తి కాం
తామణి రాశివాసము; ప్రధాన నికేతనమెల్ల శ్రీ లకుం
గామిగోత్రి మీ జగతిఁ గల్పకమై విలసిల్లు నెల్లెడన్. ౧

ఆమహితాన్వవాయకలశాంబుధి శీతకరుండు, యాచక
స్తోమచకోర బృందపరితోషిత సుందరమూర్తి, సద్యశో
ధాముఁ డనంతరెడ్డి, జనతా వినుతామల వర్తనుండునై
ప్రేముడినేలె మేలనఁగఁ బృథ్విని చించోలు మండలావనిన్. ౨

ఘనుఁడా రెడ్డికి నిత్యమంగళుఁడు రంగారెడ్డి జన్మించె, స
జ్జనలోక ప్రియవరుండు, ధీమహితుఁడా సత్యవ్రతోల్లాసియై
వనితాతల్లజఁ బెండ్లియాడె సరసాంబాదేవి; సవ్యాదు నో
మిననోముల్ ఫలియించి పుట్టె యశముల్ మిన్నంట గోపాలుఁడే 3

మెప్పించె వేల్పుల నొప్పుగు పూజల
వర్ధిల్ల శుభములే భక్తవరుఁడు
భూషించె సూరుల భూరిసత్కృతులతో
వాసిమించఁగనే వాగ్విలాసి
కాపాడె నర్థుల ఘనదానములు సేసి
మేలుమేలనఁగ నే మేటిదాత

రక్షించెఁ బ్రజనెల్ల రమణీయ వృత్తుల
ఖ్యాతిగాంచంగనే యధిగుణుండు
నిరతసజ్జన గోష్ఠులఁ బరఁగువాఁడు
నీరజాతాక్షు హృత్పీను నిల్పువాఁడు
కూర్మిఁ గవితామృతమ్ముల గ్రోలువాఁడు
భవ్యగుణములవాఁడు గోపాలఱేఁడు. ౪

అనయంబా దమయంతి సీత యనసూయాదేవి మున్నైన పా
వన చారిత్రల సచ్చరిత్రలు మదిన్ భావించి యుప్పొంగు నా
యన సూర్యావనితా విభూష, తన భార్యారత్నమై యొప్పి మ
న్నన కెక్కెన్ శుభసంతతుల్ వడసి యానందించు గోపాలుఁడున్. ౫

ఉల్లము పల్లవింప మధురోజ్జ్వల రామకథామృతమ్ములన్
బెల్లుగఁ గ్రోలి యాకృతిని వెల్వడఁజేసె నుదారుఁడైన భూ
వల్లభతల్లజుం డితఁడు వారిగఁ దామరతంపరై యశో
వల్లరి దిగ్వితానముల వాసిలఁ జేయఁ బరీమళంబులన్. ౬

ఆంధ్రభాషామాత చరణాంఘ్రి యుగమున
శోభిల్లు మల్లికా సుమములనఁగ
కీర్తి సన్నుతగాత్రి క్రీడఁగై సేయు
నఱవిచ్చు సంపంగి విరులనంగ
కవితారమాకాంత కమనీయ గళసీమఁ
దనరారు వెలిదమ్మి నవలనంగ

సౌభాగ్యభామినీ చారుఫాల తలానఁ
దులకించు మేల్జాజి యలరులనఁగ
మించు, వాసించు, నెఱి గుబాళించు నించు
వీని వితరణ సత్క్రియల్ వివిధ గతుల
సంతతంబును గావ్య సంతతశోభ
లఖిల హరిదంతరమ్ముల నలముకొనఁగ. ౭

## ఆశీస్సుగంధి

శ్రీలు మేలు పేరు పెంపు చెన్ను మీఱఁగూర్చి, యు
ద్వేల సౌఖ్యవైభవంబు వెల్లివాఱఁజేసి గో
పాలరెడ్డిఁ బ్రోచుఁగాత! భద్రమూర్తి నెమ్మి గో
పాలపేట దివ్యధామవాసుఁడైన రాముఁడే. ౮



# విషయ సూచిక

విజ్ఞానవర్ధినీ గ్రంథావళి ౮.

# అలంకార వసంతము



కారణ వసంతము

౧౯౪౪

'శిరోమణి'

చలమచర్ల రంగాచార్యులు

సర్వస్వామ్యలు గ్రంథకర్తవి



ప్రతులు ౫౦౦



ప్రథమ ముద్రణము

తారణ వసంతము

౩౦. ౩. ౧౯౪౪



వెల రు. ౧-౦-౦



ప్రేమసాగర ముద్రణాలయము,

హైదరాబాదు

శ్రీ

# అలంకార వసంతము

## పుష్పాంజలి



శ్రీరమాసతి చెంతఁజెన్నొందెడి స్వాఁమ
సౌదామినీరుచి సంతరింప
భారతీపతి పుత్ర భారతీనాదంబు
మృదులగర్జితగతి ముదమునింప
బృందారకేంద్రాది బృందారబృందముల్
ప్రముదితచాతక ప్రిథగణింప
ఆనందితాశేష వన్యానీశసంఘముల్
నీలకంఠమ్ముల లీలఁబెంప
సారకరుణామృతాసార ధారలొలుకు
దివ్యవారిదమా! నీకిదే నమస్సు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

## యశోవైభవము

మహతీతీఁగెల మ్రోఁగి మందాకినిని దోఁగి
పొందామరల మేలి పొలుపు లెంచి
వాల్మీకిసూక్తుల బాళించి మునిజన
పావనహృదయాలఁ బరిమళించి
కాళిదాసునిపల్కు కప్పురమ్ములు రేఁపి
భవభూతి వాక్సుధఁ బ్రీతిఫలించి
భోజరాజు పసిడి ముత్యాలు కైసేసి
భాస్కరు కరముల ప్రభదలిర్చి
మొల్ల మల్లెల ఘుమఘుమల్ కొల్లఁగొట్టి
నిఖిలవాఙ్మయ వీధి వెన్నెలలుగాయు
నీయశోవైభవమె యిందు నివ్వటిల్లు
విశ్వనుతనామ! గోపాలపేట్కరామ!

## అలంకార సత్కారము

మహితశబ్దావళి మధురార్థ నివహంబు
లలిత శరీర కల్పనము సేసి
సకలశోభాహేతు సద్వ్యంగ్య మర్యాద
దీపింపఁ బ్రాణప్రతిష్ఠఁ జేసి
గుణభావ సంగతి కొమరారఁ గూర్చి
వృత్త మహత్త్వాల నెసఁగఁ జేసి
పాక రసాంచిత బంధుర రీతులు
విమలభక్తి నివేదితములు సేసి
మృదుల శయ్యోపచారముల్ మెఱయఁ జేసి
పదమలాలంకృతుల నిన్ను సత్కరింతు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

# శబ్దాలంకార పరిమళము

## ఛేకానుప్రాసాలంకారము

స్వరూపము:- 'రెండేసి వ్యంజనముల జంటలకు వ్యవధానము లేకుండఁగ ఆవృత్తి గలిగిన ఛేకానుప్రాసమగును.'

ఉదా:- రాజరాజత్పదాంభోజ సద్గుణ రాజి
రాజిత! శ్రుతినుతాళి రాజమాన!
భాసురధీరథీ! ప్రణతార్తి భంజన!
జనమనోరంజన సాంద్రచంద్ర!
శతపత్రపత్ర సమ్మిత నేత్ర! శుభగోత్ర!
గోత్రవర్ధన సుచరిత్ర జైత్ర!
శ్రీరమణీమణీ శృంగారవన! వన
మాలికావాసిత మహితవక్ష!
అఖిల సజ్జన నిత్యకల్యాణ కేతు!
దుష్టదానవ కులమహాధూమకేతు!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇట రాజరాజ; రాజిరాజి; జనజన; పత్రపత్ర; గోత్రగోత్ర; మణీమణీ; వనవన; అనివ్యంజన యుగ్మములకు వ్యవధానము లేకుండఁగ ఆవృత్తి గలుగుట నిది ఛేకానుప్రాసమైనది.

ఛేకులన విద్వాంసులు. వారికభిమతమైనది గావున దీనికీ పేరువచ్చినది.

## వృత్త్యను ప్రాసాలంకారము

స్వరూపము:- 'సంఖ్యా నియమము లేక ఒక యక్షరమునకే గాని, రెండక్షరములకే గాని, మూఁడక్షరములకే గాని ఆవృత్తి గలిగినచో వృత్త్యను ప్రాసమగును.'

ఉదా:- పాలు ప్రాలేయాల జాలు మేలగుమల్లె
పూలు వెన్నెలలు ముత్యాలశ్రీలు
మేరుగైరిక వార సార మారుణజపా
వారి రత్న ప్రభోదారస్మృతులు
వ్యాలోలసీల తమాల కాలోరగ
క్ష్వేళ కాళిందినీ వేల్లితములు
తేనెలు కపురంపు సోనలు నమృతంపు
వానలు మిన్నేటి జానుగతులు
సృష్టిసామగ్రిగాఁగ సృష్టించె ధాత
త్వద్యశంబు, శూరత, హేతి, వాలుఁగనులు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- మొదటి పాదము మూఁడవ పాదములలో లకారమునకును, రెండవ పాదమున రేఫకును, నాలుగవ పాదమున నకారమునకును అసకృదా వృత్తి గలుగుట నిది వృత్త్యనుప్రాసమైనది

## లాటానుప్రాసాలంకారము

స్వరూపము:- 'ఒకానొక తాత్పర్య విశేషము దోఁచుచు శబ్దార్థములు పునరుక్తములగు నేని లాటానుప్రాస మగును.'

ఉదా:- జానకీపతి నెంచు శబ్దంబు శబ్దంబు
చక్రపాణి వచించు శక్తి శక్తి,
విష్ణుగాథలఁ దేలు వృత్తంబు వృత్తంబు
గోవిందుఁ బొందిన గుణము గుణము
మురవైరి భూషించు భూషలు భూషలు
శ్రీనాథుఁ డొప్పిన రీతి రీతి
సాకేతపతి మెచ్చు పాకంబు పాకంబు
శరధిశాయి వెలుంగు శయ్య శయ్య
రామచంద్రుఁ డురంజించు రసము రసము
కమలలోచను వర్ణించు కవిత కవిత
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇందు 'శబ్దము శబ్దము' 'శక్తి శక్తి' మొదలగు పద యుగ్మములలో, ఆవృత్తములయిన పదములు స్వప్రయోగ సామర్థ్యమువలన భగవద్విషయిక కావ్యప్రయుక్తములైన శబ్దాదులే యుత్కృష్టములుగాని అన్యములు గావను తాత్పర్య విశేషమును గలిగించుచున్నవి కాన ఇది *లాటానుప్రాసమైనది.

---

*లాటదేశీయులకు ప్రియమైన అలంకారము గావున ని[illegible] [illegible]నుప్రాస మనఁబడుచున్నది.

## పునరుక్త వదాభాసాలంకారము

స్వరూపము.- "అర్థము పునరుక్తమైనట్లు తోఁచు శబ్దములు ప్రయోగింపఁబడిన పునరుక్తవదాభాస మగును."

ఉదా:- సత్కళానిధి రాజచంద్రుండు మృదుకర
రంజిత కువలయప్రథితయశుఁడు
తేజస్వి యూర్జస్వి దీవ్యత్ప్రతాపుఁడు
మిహిరుఁడులోకైక మిత్రమూర్తి
శంకరుం డుగ్రుండు శాసితకాముఁడు
వరరాజమకుటుండు పురహరుండు
సుమనసోల్లాసుండు సురగణాహ్లాదుఁడు
పాలితవిబుధుఁడు ప్రణతహితుఁడు
భాస్కరాన్వయుఁడగు రామభద్రుఁడంచు
వందులొనరింతు రీకు కైవారములను
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇట ఒకొక్క పాదములోను ప్రయోగింపఁబడిన పదములు వినఁగనే సమానార్థకములుగఁ దోఁచును. కాని విచారించి వ్యుత్పత్త్యర్థ విశేషార్థములు పరిశీలింపఁగా అన్నియు వేఱు వేఱు అర్థము నిచ్చునవియే యగును. ప్రకరణార్థమునకు శోభగలిగించుచు నిది యలంకారమైనది.

## యమకాలంకారము

స్వరూపము:- "అర్థభేదము గలుగ స్వరసహితములగు వ్యంజనములకు ఆవృత్తిగలిగిన యమకాలంకారమగును."

ఉదా:- పొగడొందు నేరాజు నగరాజ నగరాజ
సముఁడన దాన సారములయందు
పొలుపొందు నేపతి ఫుల్లాబ్జ ఫుల్లాబ్జ
నిభుఁడన రుచికళా నిరతులందు
వర్ధిల్లు నేవాగ్మి వాగీశ వాగీశ
కల్పుఁడై సృష్టి ధీ గరిమలందు
ముదమొందు నేభోగి భోగీంద్ర భోగీంద్ర
సభటుఁడై ధూర్వహ విభుతలందు
రాజమాత్యుఁడై కీర్తి విభ్రాజమాన
దశదిశారాజి దశరథ తనయవరుఁడు
రమ్యగుణధాము! సజ్జనారామసీము!
విశ్వనుతినామ! గోపాలవేలు రామ!

సమన్వయము:-ఇట నగరాజ నగరాజ, ఫుల్లాబ్జ ఫుల్లాబ్జ, అనురీతిగా స్వరసహిత వ్యంజనావళి యావృత్తమైనది. అర్థభేదమును గలదు. కావున విధియమకమైనది
ఆది మధ్యాంత యమకమని యమకము మూఁడు విధములు. ఇది మధ్య యమకము.

# నిరోష్ఠ్యము

స్వరూపము:- 'ఓష్ఠ్యమగు వర్ణమొక్కటియు ప్రయోగించకయే నిర్వహించిన రచన నిరోష్ఠ్యమగును.'

ఉదా:- కడలి సృజించితగాధత దెలియఁగ
తారాగణ నదితతి దయకనంత!
శాంతికి సాక్షిగా సంతరించితి క్షితి
స్థిరత కచల రాజి చేసి తీశ!
ఖరకర కిరణాళి కాంతికి చిన్నియ
చంద్రిక కీర్తికి సాటి శార్ఙ్గ
సకలగతి కఖండ శక్తి సదాగతి
సింగిని ఘనత కెసంగ సెనఁగ
అఖిల శక్తి నిఁజాఁట నీ యఖిల జగతి
చిత్ర చిత్ర చరిత్ర! శ్రీ శ్రీకళత్ర!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఊకారము, ప ఫ బ భ మ యను వర్ణములు ఓష్ఠ్యములు. ఆ ఓష్ఠ్యములు లేకుండఁగ ప్రస్తుతోదాహరణ పద్యము (మకుటము గాక) నిర్వహింపఁబడుట నిది నిరోష్ఠ్యము.

ఇది చిత్ర కవితయని కూడ వ్యవహరింపఁబడును.

ఇట్లే 'అచల జిహ్వము' తలకట్లు, గుడులు, కొమ్ములు, అక్షర విలోమము, ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి మున్నగు నియమములతో సాఁగించు రచనలన్నియు చిత్ర కవితగా వ్యవహరింపఁబడును. రస భావాది విశేషములు లేక పోవుటచే ప్రతి భావంతులగు మహాకవులు ఈ గడ్డి పూలకై యెక్కువ పాకులాడరు.

## ముక్తపదగ్రస్తము

స్వరూపము:- 'విడిచిన పదమునో పదైకదేశమునో తిరిగి గ్రహించుచు చేయు రచన ముక్త పదగ్రస్త మగును.'

ఉదా:- వనమాలికానూన వరసౌరభోల్లాస
చంచరీకోద్గీతి చలితనయన!
నయనాంచల తరంగ నవనాట్య చాతురీ
గుంఫిత శ్రీముఖ కుముదచంద్ర!
చంద్ర నీరక్షీర సద్ధార నీహార
తారావళీ సుధాసార కీర్తి
కీర్తి మహోరుచి స్ఫూర్తి వాసితచిత్త!
సురగణాశ్రిత దివ్య చరణపద్మ!
పద్మభవ ముఖ్యసంస్తుత భద్రరూప!
రూప జిత పుష్ప చాప! నీరూపుఁ జూపు!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- పాదాంతములందు విడిచిన పదములను తిరిగి గ్రహించి ద్వితీయాది పాదాదులుగా నుపనిబద్ధించుచు రచింపఁ బడుట నిది ముక్త పదగ్రస్తమైనది.

పాదాంతములందు విడిచిన పదములనే గ్రహింపవలెనను నియమము లేదు. పాదమధ్యగతపదములను గ్రహించి కూడ ఈరచన సేయ వచ్చును.

## లీన రచన

స్వరూపము:- 'ఒక పద్యములో మఱియొక పద్యము ఇమిడి యుండు నట్లు రచించిన రచన లీనరచన యనంబడును.'

### లీన ద్విపదము

'సాంద్రమేఘము నీవు చాతకమేను' నీ
కరుణ వర్షింపవే కసి దీఱ
'చంద్రుండవీవు నే చంద్రకాంతమను' నీ
కరముల మలయించు గాసిదీఱ
'కుసుమంబు నీవు నే కొదమ తుమ్మెదను' నీ
పజ్జఁజేర్పింపు పిపాస దీఱ
'రస మానసంబీవు రాయంచ నేను' నీ
యండఁ జేర్చుకొనుము! యలఁత దీఱ
ప్రకృతి సిద్ధము మనకిట్టి బాంధవంబు
విడువఁజూడక కావవే విశ్వనాథ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతినామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఈ యుదాహరణ పద్యమున ఆద్యంత చిహ్నములు (' ') గల నాలుగు భాగములు గలిసి రెండు ద్విపదలగుచున్నవి. ఇట్లే వివిధ లీన రచనల నెఱుంగునది. దీనికే గర్భ కవిత్వమని ప్రసిద్ధి.

## సర్వలఘువు

స్వరూపము:- 'లఘువులగు వర్ణములతోనే సర్వ రచనయు నిర్వహించిన సర్వలఘు వనఁబడును.'

ఉదా:- నయనరుచిజితకమల ! నవజలద సమవిభవ !
మహితమణి ఘృణిరుచిర ! మధురహృదయ !
పరమపద సుఖభవన ! సురవినుత చరణయుగ !
మునినిచయ నుతచరిత ! భువన భరణ !
కలికలుష వనదహన ! బలిమకుట నిహితపద !
దనుజఖల కులతిమిర తరణి కిరణ !
భవజలధి తరణపద ! వరనిగమ గణవినుత !
భజన పరజన దురిత పటల శమన !
వరద మము గరుణగనుము వనధిశయన !
శరణు దశరథ వరసుత శరణు శరణు !
రమ్యగుణధామ ! సజ్జనారామసీమ !
విశ్వనుతనామ ! గోపాలపేటరామ !

సమన్వయము:- లఘువులతోనే నిర్వహింపఁబడుట నిది సర్వలఘువై నది

విశేషాంశము:- ఒక్కొక పాదము ముప్పదియారు లఘువులుగల నాలుగు దీర్ఘ పాదములపైన తేటగీతియో, ఆటవెలఁదియో చేర్చిన సర్వలఘు సీసమగును. పాదములలోని మొదటి యారు గణములు పదము విడివడునట్లు కూర్చిన పద్యమునకు ఒకతీరు చక్కని గజ్జల గుర్రపు నడక వచ్చి వీనుల విందగును.

## సార్వవిభక్తికము

స్వరూపము:- 'విభక్తులన్నియు వరుసగా వచ్చునట్లు పదవిన్యాసము చేసి రచించినయెడల సార్వ విభక్తికమగును.'

ఉదా:-
రాముఁడు జగదభిరాముఁడు సజ్జనా
రాముఁడు వెలయించె రవికులంబు
రాముని సత్కీర్తిధాముని భావన
నాముని మునిపిల్చె నోమ మఖము
రాముచే సితకీర్తి సోముచే జానకీ
కాముచే ధనువయ్యె ఖండితంబు
రామునికై ప్రియసామునికై శుచి
సీమునికై రాజు సీతనిచ్చె
రామునివలనఁ దలఁకిరి రాక్షసాళి
రామునకుసాటి గన్పట్టు రామునందు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇందు రామ శబ్దము వరుసగా అన్ని విభక్తులతోను సంగతమై మల్లెపూల దండలో నడుమ నడుమ నిమిడ్చిన 'గులాబి' పూవు వలె నింపెసలారుచుండుట నిది సార్వ విభక్తికమైనది. సంబుద్ధి గీతము తుదిని నిబద్ధింపఁ బడినదని గ్రహించునది.

# అర్థాలంకార పరిమళము

## ఉపమాలంకారము

స్వరూపము:- 'వాక్యార్థమునకు శోభా హేతువును సహృదయానంద జనకమునగు ఔపమ్యము ఉపమాలంకారము.'

ఉదా:-

సర్వలోకానంద సంధాయకము రమ్య
వదనంబు జాబిల్లి పగిది వెలయ
సకల మనోహర చారుతారీతులఁ
గందోయి పొందమ్మి పొందు నెంప
అఖిల ధూర్వహణక్రియా శక్తి భుజపీఠి
యహిరాజ భోగ సామ్యంబునొంద
నిఖిల జగదక్షి నిర్ణిద్ర తేజంబు
చండ భాస్కరకాంతి సాటి నెసఁగ
అమల రఘువంశ కలశాబ్ధి నవతరించి
జగము లేలెడి దేవ! యంజలి ఘటింతు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇందు భగవద్వదనాదికములకు జాబిల్లి మున్నగువాని ఔపమ్యము చెప్పఁబడినది. ఈ సాదృశ్య వర్ణనము వలన నైసర్గికముగనే యుత్కృష్టములగు భగవద్వదనాదులకు మఱింత యతిశయము తోఁచి భగవత్ప్రశంసా రూపమగు ప్రకృత వాక్యార్థమునకు వన్నె హెచ్చినది గావున నిది ఉపమాలంకారమైనది. ఉపమానము, ఉపమేయము, సాదృశ్య వాచకము, సమాన ధర్మము అను నివి ఉపమా సామగ్రి. పూర్ణ, లుప్త, తదవాంతర భేదములతో ఉపమాలంకారము పెక్కు విధములు.

# ఉపమేయోపమాలంకారము

స్వరూపము:- 'వీనితో సాటి వచ్చు మూఁడవ వస్తువు లేనే లేదను తాత్పర్యము వచ్చుటకై చేసిన, పరస్పరము ఉపమానోపమేయభావమును పొందిన రెండు వస్తువుల సాదృశ్య కథనము ఉపమేయోపమాలంకారము.'

ఉదా:-

జలధి నీవాటిది జలధి సాటివి నీవు
కొమరారు గాంభీర్య గుణమునందు
కనకాద్రి నీసాటి కనకాద్రి సముఁడీవు
జగము నిల్పఁగఁజాలు స్థైర్యమందు
సురశాఖి నీజోడు సురశాఖి తోడీవు
సర్వార్థ వితరణ సరణియందు
పురుహూతుఁడెన నీకు పురుహూతునకు నీవు
సాటి వైభవ కళా కోటియందు
జానకీ జాని! దాశ్రిత సక్త హాని!
కావు మఱమాని మము గనికరము పూని
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- గాంభీర్యాది గుణములలో సముద్రము— శ్రీరామచంద్రుఁడు; కనకాద్రి— శ్రీరామచంద్రుఁడు అనురీతిని నిరూపితులగు ఈ యిద్దఱే గాని వారికి సాటి వచ్చు మూఁడవ వస్తువు జగత్తులో లేనేలేదను తాత్పర్యము వచ్చు రీతిని ఔపమ్యము వర్ణింపఁబడుట నిది ఉపమేయోపమాలంకారము.

## అనన్వయాలంకారము

స్వరూపము:- 'దీనితోఁ బోల్పఁదగినది రెండవదిలేదు' అను అభిప్రాయము వచ్చునట్లుగా ఒక వస్తువునందే ఉపమానోపమేయ భావకల్పనము చేసి యౌపమ్యమును వర్ణించిన అనన్వయాలంకారమగును.

ఉదా:- భవదీయ నిర్వ్యాజ వరకృపా స్ఫూర్తికి
పోలుపారు నీకృపా స్ఫూర్తి సాటి
భవదీయ నిస్సీమ వరశౌర్య దీప్తికి
దీపించు నీశౌర్య దీప్తి జోడు
భవదీయ నిర్మల వరతనూకాంతికి
శోభిల్లు నీతనూ సుషమయీడు
భవదీయ నిరవద్య వరగుణ రాజికి
రాజిల్లు నీగుణ రాజిసమము
అన్య సామ్యంబు నీకు లేదనఘ చరిత!
భద్రికరనామ! భాస్కర వంశసోమ!
రమ్యగుణధామ! సజ్జనా రామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- నీకృపా శౌర్య కాంతి గుణములకు నీకృపాదులు సాటి యనుటవలన భగవద్గుణాదులకు సాటి వచ్చునవి మఱియేవియు లేవని తాత్పర్యము వచ్చుచున్నది గావున నిది అనన్వయాలంకారమైనది.

## అసమాలంకారము

స్వరూపము:- 'ప్రకృత వస్తువునకు సమమైనది లేనే లేదని చెప్పినచో అసమాలంకార మగును.'

ఉదా:- జగతీ తలంబెల్లఁ జల్లగా వర్షిల్లి
నివ్వటిల్లఁగ నేలు నేర్పునందు
శరణార్థియైనంత శాత్రవుఁడైనను
తనవానిగాఁ బ్రోచు ధర్మమందు
అర్థింపఁ బడకయే యర్థి మనోరథ
సిద్ధిగావించు ప్రసిద్ధియందు
అఖిల దుర్జన కోటి నల్లాడఁగాఁ జేసి
భాసిల్లు వరబాహు బలమునందు
ఇందు నందేమి విశ్వంబునందు నెందుఁ
జూడ నీకెనయగు వాఁడు లేఁడు లేఁడు
రమ్యగుణధామ! మునిజనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ప్రకృత వర్ణ్యుఁడగు శ్రీరామచంద్రునకు సముఁడగు వాఁడు లేనే లేఁడనుట నిది అసమమైనది. కేవల నిషేధము అలంకారము కాదు; కాని ఇట సదృశ వస్త్వంతర నిషేధము ప్రకృతము వర్ణ్యుఁడగు శ్రీరామచంద్రుఁడు సర్వ విలక్షణుఁడు అను విశేషమును దెలుపుట నిది యలంకారమే యని తాత్పర్యము. అనన్వయమున సాదృశ్య నిషేధము వ్యంగ్యము. ఇట వాచ్యము. ఇది వీనికి భేదము.

## ఉదాహరణాలంకారము

స్వరూపము:- 'సామాన్యముగాఁ దెలిసిన ఒక విషయమును అంతంటె విశదముగాఁ దెలుపుటకై అందులో ఒక విశేష భాగమును దీసి నిరూపించి ఆసముదాయ విశేషములకు అవయవావయవి భావము గలదని తెలియఁ జెప్పిన ఉదాహరణాలంకారమగును.'

ఉదా:- మితిలేని యాయాయి మేలిగుణంబుల
 కెన్నింటికో తానె యిల్లుగాఁగఁ
దనరుచుండియు నొక్క తప్పుచే లోకంబు
 బహు దూషణములకుఁ బాత్రమయ్యె
అభిజాత్య పరాక్రమాది గుణంబులఁ
 బేరెన్నికను గన్న వీరుఁడయ్యు
నీచ మోహంబుచే సంగతుఁడై కూలు
 నసురేశ్వరుండు దశాస్యుమాడ్కి
అఖిల శుభగుణ రత్న రత్నాకరంబ!
యుజ్జ్వలానంత లీలా సముత్కరంబ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- 'ఎన్ని గుణము లున్నను ఒక్క యవగుణముచే లోకము నిందింపఁబడును' అనునది సామాన్యము. లోకములో నొక్కఁడగు రావణాసురుని ఉదాహరణముగాఁ జెప్పి యాసామాన్యముగాఁ దెలిసిన విషయమే విస్పష్టము చేయఁబడినది గావున నిది యుదాహరణాలంకారమైనది.

లోకము అవయవి. రావణుఁడు అవయవము అని యిట అవయవావయవి భావమును గుర్తింపవలెను.

## స్మరణాలంకారము

**స్వరూపము:-** 'సదృశ వస్త్వనుభవము వలన పూర్వానుభవ జనితమైన సంస్కారమునకు ఉద్బోధము కలుగఁగా తత్సదృశ వస్త్వంతరమును స్మరించుట స్మరణాలంకార మనఁబడును'

**ఉదా:-**

జనకాత్మజామూర్తిఁ గనులార సేవింప
శ్రీసతి రూపంబు స్మృతికివచ్చి
లక్ష్మణు సేవా విలక్షణుఁ గన్గొన
భుజగాధి నాథుని పొలుపు దోఁచ
భరతుని సౌజన్య భరితు నాలోకింప
అల సుదర్శన లీల లాత్మవెలసి
శత్రుఘ్ను సజ్జన శత్రుఘ్ను వీక్షింపఁ
బాంచజన్యము మది సంచరించ
నిన్ను దర్శింప పద్మాక్షు చిన్నె లెడఁద
మెఱసి పులకితు లౌదురా సురులు భువిని
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

**సమన్వయము:-** సీతారాములను, లక్ష్మణ భరత శత్రుఘ్నులను దర్శింపఁగా మున్ను వైకుంఠమునఁ దాము సేవించినప్పుడు గలిగిన సంస్కారము ఉద్బుద్ధమై సీతారామాదులకు సదృశులగు లక్ష్మీశ్రియఃపతులను తత్పరివారములను సురులు స్మరించిరి గావున నిది స్మరణాలంకారమైనది.

## రూపకాలంకారము

స్వరూపము:- 'ఉపమేయమును మఱుగు పఱపక యే యందు ఉపమానము నారోపించుట రూపకాలంకారము.'

ఉదా:- మునిజన ముఖ పద్మములు నెఱి వికసించె
ఖలనేత్ర కైరవ కాంతులణఁగె
విజ్ఞాన జాగృతి వికసిల్లె నెల్లెడ
నసురాంధకారము లంతమొందె
బుధచక్ర సంతాప మూర్ఛలు వడిఁదగ్గ
ప్రేనురాగము విశ్వ వీధిఁబర్వె
ద్విజకుశీలవ బృంద దివ్యగాన మెసంగె
దోషాకర విచేష్ట దొలఁగి చనియె
సింహా పీఠోదయాచల సీమ, రామ
భాను బింబంబు దోఁప సద్వంశ దీప!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము.- ఇందు ఉపమేయమగు రామునియందు ఉపమానమగు భానువు, ముఖాదులందు పద్మాదులును ఆరోపింపఁ బడుట నిది రూపకమైనది. రాముఁడను భానుబింబము అని విగ్రహవాక్యము చెప్పుకొనవలసి యుండుటచే ఉపమేయము అపహ్నవింపను బడ లేదని తాత్పర్యము. ఇది సమస్త వస్తు విషయకము. సావయవ నిరవయవ పరంపరిత భేదముల రూపకాలంకారము బహువిధము.

## పరిణామాలంకారము

స్వరూపము:- 'ఉపమేయము ప్రకృత కార్యోప యోగార్థము ఉప మానాకారమునఁ బరిణమించుచో పరిణామాలంకారమగును.'

ఉదా:- అంకంబు సేర శ్రీప్రియకుఁ జానకికిని
చెన్నారు పూవుల శిబికయయ్యె
అవభృథంబులు సేయ సవనీ సురాళికి
రంగారు సమృత తరంగమయ్యె
భవసింధుఁ దరియింప భువిభక్త కోటికి
నొయ్యారి ముత్యాల యోడయయ్యె
తాపంబు వాయఁగాఁ దాపసోత్తములకు
మెఱుఁగు లీనెడి దివ్య మేఘమయ్యె
మంగళధ్వజ పద్మాది సంగతంబు
లోక భద్రాకరంబగు నీ కరంబు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- శ్రీరామచంద్రుని హస్తము ఉపమేయము. అది సీతా దులకు అంకాశ్రయణాది కార్యోప యోగార్థము ఉపమానమగు పుష్ప శిబికాదుల రూపమునఁ బరిణమించుట నిది పరిణామాలంకారము రూపకమున అప్రకృతము ఆరోపమున ప్రకృతోపరంజనము మాత్ర మగును. ఇటనో ప్రకృత తాదాత్మ్యము నే పొందును. ఇదియే వీనికి భేదము.

## సందేహాలంకారము

స్వరూపము:- 'కవి సమ్మతమైన సాదృశ్యమువలన ఉపమానోపమేయములు సందేహమునకు విషయములగు నేని సందేహాలంకారమగును.'

ఉదా:
అసువులు వోసిన యపరంజి బొమ్మయో!
నిలుకడల్ నేర్చిన కలికి మెఱుపొ!
మెయిదాల్చి పూవింటి మేటికై నెరుపొ!
చెలువమైనిలుచు ప్రాఁబలుకు పలుకొ!
తావుల నెగఁజిమ్ము నీవుల తీవెయో!
పాలేరు పంచు ముత్యాల సరమొ!
ఇలువేల్పు కోఁగంటి వెలిదామరల చాలొ!
రాజిల్లు దరిఁజేరు రాచసిరియొ!
తెలియ నేరము సొబఁగుల నోలుకు నీవు
కెలన నున్నట్టి దెవ్వరో కీర్తిసాంద్ర!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఉపమేయమగు సీతాదేవియు, ఉపమానములగు అపరంజి బొమ్మ మొదలగునవియు సందేహ విషయములగుట నిది సందేహాలంకారము. శుద్ధ, నిశ్చయగర్భ, నిశ్చయాంత భేదమున నిది మూఁడు విధములు.

ఈ సందేహము ప్రకృతోపకర్షకు హేతువగునట్లు కవి ప్రతిభోత్థాపితము గావుననే యలంకారమైనది. కావున కేవల లౌకిక సందేహము అలంకారము గాదని తాత్పర్యము.

## భ్రాంతిమదలంకారము

స్వరూపము:- "కవి సమ్మత సాదృశ్యము వలన ఉపమేయము ఉపమానముచే మఱుగు పడిపోవ, నందు ఉపమాన ధర్మానుభవము గలిగినచో భ్రాంతిమదలంకారమగును"

ఉదా:- కాలోగ్ర మాహిష ఖురఖుర ఘట్టనం
బనుభీతి యసురులు వణఁకిపోవ
విజయదుందుభి శబ్ద వీచీపరంపర
యని నెమ్మి సమరులు దవరుచుండ
సమయ సముద్భూత జలద గర్జితమతి
హాలిక మనము లాహ్లాద మొంద
వాణీ కరోల్లాస వీణాస్వనంబని
కూర్మి గంధర్వులు గొండ్లిసల్ప
దిక్కు లెల్లను మార్మ్రోగి పిక్కటిల్ల
నీదు కోదండ టంకార నాద మెసఁగు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతినామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఉపమేయము భగవత్కోదండ టంకారనాదము; అది ఉపమానములగు యమమహిష ఖుర ఘట్టన శబ్దాదులచే పిహితమైనది. అందు తత్తదను గుణముగ ఆయా గృహీతృ భేదముచే కొందఱికి భయము, కొందఱికి సంతసము, గలిగినది కావున నిది భ్రాంతిమదలంకారము. ఇందు ఉపమేయాచ్ఛాదక మగు సాదృశ్యము కవి ప్రతిభోత్థాపితము కావలెననుట శుక్తి రజతాది భ్రాంతి అలంకారము కాదని తాత్పర్యము.

# ఉల్లేఖాలంకారము

స్వరూపము:- 'ఒక వస్తువే గృహీతృ భేదమున వేఱువేఱుగ ఉగ్గడింపఁ బడిన ఉల్లేఖాలంకారమగును.'

ఉదా:-

పలరాజు రూపొంది వచ్చెనే విచ్చెనే
 తలఁపు పూవు లనేక తలిరు బోండ్లు
మమ్మేలఁ బుట్టెఁ బొందమ్మి రేకులకంటి
 దంటయేయని పొంగు తబిసి ప్రేండ్లు
తన పంగడము పేరు దనరార వేవెల్గె
 వెలసె మేశ్మేలను కొలమువారు
పాల్బల్కు చెక్కుచుక్క భాసిల్లఁ జదువెల్ల
 నుర్విపై దిగెనను నొజ్జదొరలు
వేడుకలరఁగ నిను గొని యాడుచుండ
నేల కానవుఁ జూతువె వాలుగనుల?
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇట రామచంద్ర రూపము ఒక వస్తువే ఆయా గృహీతల యిచ్ఛానుసారము మన్మథాది రూపమున వేఱువేఱు విధములుగ నుగ్గడింపఁ బడుట నిది ఉల్లేఖాలంకారమైనది.

## ఉత్ప్రేక్షాలంకారము

స్వరూపము:- 'ఉపమాన ధర్మ సంబంధము వలన ఉపమేయము ఉపమానముగానే సంభావింపఁబడిన ఉత్ప్రేక్షాలంకారము.'

ఉదా:- పండువెన్నెల నిండు పాలేరు కప్పురంపు
వన్నెల నెన్ను ధావళ్య గుణము
మిన్నేరు పన్నీరు మేలి గండమ్ములఁ
జిన్నబుచ్చఁగఁజాలు శిశిరగుణము
ఎల్లకొండల కడ లెల్ల నీర్వాములు
గడచి పర్వెడు ననర్గళ గుణంబు
అసలు పాతర విన్ను లపయశంబుల మించు
పాపముల్ వాపు పావన గుణంబు
కలిగి మెసలారు నీకీర్తి వలన జగము
పూతమయ్యెను సురనదిచేత ననఁగ
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వవినుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఉపమానమగు సురనదికిఁగల ధావళ్య శిశిరాది గుణములు గలిగియుండుట ఉపమేయమగు భగవత్కీర్తి సురనదిగానే సంభావింపఁ బడినది కావున నిది యుత్ప్రేక్ష. అసంభావనయు హేతు రూపమగుట నిది హేతూత్ప్రేక్ష యని తాత్పర్యము. జాతి గుణ క్రియా ద్రవ్యములు స్వరూపములుగను హేతువులుగను, ఫలములు గను సంభావింపఁబడుచు ఉత్ప్రేక్ష బహువిధము లగుచున్నది.

## అతిశయోక్త్యలంకారము

**స్వరూపము:-** 'కవి ప్రౌఢోక్తి వలన ఉపమేయమును మఱుగుపఱచి ఉపమానమునే ప్రధానముగ నిబద్ధించిన అతిశయోక్తి యనబడు.'

**ఉదా:-**

పాదులు కదలఁగాఁ బ్రాలేయ గిరినూపి
పొగడిక గన్న దీ భుజము గాదు
దాసోహమనఁగ నీ దశదిశావలయంబు
ఖ్యాతి గన్నట్టి దీ హేతి గాదు
చెంపలు వాయ నిలింపాధిపతి మోది
చెలఁగిన దీ యింద్రజిత్తు గాఁడు
అబ్బలు తలఁపురా నమరుల నల్లాడ్చి
వదలిన దీ చమూపతులు గారు
వేఱె యవియను రణభూమి విజయధామ
ప్రళయ భీముని నినుఁగాంచి రావణుండు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

**సమన్వయము:-** ఇది యభేదమున భేదము పలుకుటయను అతిశయోక్తికి ఉదాహరణము. రావణుని భుజము, ఆయుధము మొదలయినవెల్ల తొల్లింటివే కాని కవి ప్రౌఢోక్తి వలన అవి నిషేధింపఁబడి యన్యములుగా నిబద్ధింపఁ బడినవి కావున నిది యతిశయోక్తి. ఇది అభిన్నములను భిన్నములని చెప్పుట. భిన్నములను అభిన్నములనుట, సంబంధమున్న చోట లేదనుట, లేనిచో నున్నదనుట యను భేదములతో నాలుగు విధములు.

# అపహ్నవాలంకారము

స్వరూపము:- 'ఉపమేయమును కాదని నిషేధించి అందు సామ్యగుణ ఉపమానారోపము చేసిన అపహ్నవాలంకారమగును.'

ఉదా:- గగనంబు గాదది ఘనకులేశుని కీర్తి
వర్తిల్లు నీలి తివాచిగాని
తారకలివి గావు తావులు చిమ్మంగా
నందు జల్లిన మల్లెలవునుగాని
చంద్రుడీతండు గాండు సత్కీర్తికన్య చే
పట్టిన ముత్యాల పెట్టెగాని
లాంఛనంబిది గాదు లావణ్య మొప్పారం
గొనకొనియుటఁ దాపుగొడుగుగాని
చూడరే! యని త్వత్కీర్తి శోభ లలము
నంబరము గాంతు రిసుదతులు సంబరమున
దివ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటధామ!

సమన్వయము:- గగనాదులను కాదని నిషేధించి వానియందు నీలపాటి సామ్యమున ఉపమానములగు నీలితివాచి మొదలగు వాని నారోపించుట నిది అపహ్నవమైనది.

# ప్రతివస్తూపమాలంకారము

స్వరూపము:- "ఉపమానోపమేయములను ప్రతిపాదించునట్టి వాక్య యుగళములో వస్తు ప్రతివస్తు భావమున సాధర్మ్యము నిబద్ధింపఁబడిన ప్రతివస్తూపమాలంకారము."

ఉదా:-
అతి భయంకరమైన యాకాలకూటము
మ్రింగ సమర్థుండు మేటిశివుఁడు
భగభగలాడు నా భార్గవుకోపాగ్ని
గ్రసియింప నలఁతి శ్రీ రాఘవుండు
చండాంశు తప్త భూసంతాపముల్ వాప
కాలోదితము ఘనాఘనము తగును
కడలేని భక్తాళి కష్టముల్ దీర్పఁగాఁ
గరుణాబ్ధి జానకీ వరుఁడు పటువు
కోరి రఘువీరు భక్త మందారు ధీరు
నాశ్రయింపవె డెందమా! యనవరతము
రమ్యగుణధాము! సజ్జనారామసోము!
విశ్వనుతనాము! గోపాలపేటరాము!

సమన్వయము:- మొదటి వాక్యము ఉపమాన బోధకము. రెండవ వాక్యము ఉపమేయ బోధకము. కాలకూట గ్రసనము. కోపాగ్ని గళనము సాధర్మ్యము. అది వాక్యద్వయమున వస్తువు-ప్రతి వస్తువు వలె దిటుగా నిబద్ధింపఁబడినది. దీనిచే ఈశ్వర రామచంద్రులను సామ్యము స్ఫురించినది. గావున నిది ప్రతివస్తూపమ యైనది. మూఁడు నాలుగు పాదములను గూడ ఇట్లే సమన్వయించు కొనవలెను.

## దృష్టాంతాలంకారము

స్వరూపము:- 'బింబ ప్రతిబింబ భావమున ఉపమానోపమేయముల సాధర్మ్యము వేఱువేఱుగా నిబద్ధింపఁబడినచో దృష్టాంతాలంకార మగును.'

ఉదా:- తామర తంపరై తనరారఁ గలువులు
భువినేలఁజాలు శ్రీ ముదిత యొకతె
కువలయా మోదముల్ గుప్పించి జగమెల్ల
దీపిల్లఁ జేయు చంద్రిక యొకండె
రాజులెందఱు లేరు? రాజన్వతీప్రథ
వసుధ వెల్గును రాము వలని కతన
తారక లెన్నియో దైవాఱుగాక జ్యో
తిష్మతి నిసి సితత్విషుని కతన
నిర్మలానంద సాగర నీరజారి!
దాన కల్మష హారి! పద్మావిహారి!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము.- సంపదలు సమకూరుటలో శ్రీ యెట్లో కువలయామోదము గలుగఁ జేయుటలో చంద్రిక యట్లే అని బింబ ప్రతిబింబ భావము. అట్లే నక్షత్రము లెన్నియున్న నేమి రాత్రి చంద్రుఁడుండుట వలననే జ్యోతిష్మతి యనఁబడును రాజు లెందఱున్నను రామచంద్రుని వలననే భూమికి రాజన్వతియను ఖ్యాతి వచ్చినది అనుచోట బింబ ప్రతిబింబ భావముగలదు. రెండు యుగళములలోను సాధర్మ్యము వేఱువేఱు పదములతోనే నిర్దేశింపఁ బడినది కావున నిది దృష్టాంతము.

## తుల్యయోగితాలంకారము

స్వరూపము:- 'కేవల ప్రకృతములకు గాని, కేవలా ప్రకృతములకు గాని ధర్మసామ్యము వలన ఔపమ్యము స్ఫురించిన తుల్యయోగిత యగును.'

ఉదా:- విలసిల్ల నీకీర్తి వెలవెల్లఁబోవు నా
పాలేరు శశి మరుద్వారణములు
దీపింప నీ తేజు దిగజారు దావాగ్ని
బడబాగ్ని భాస్కర ప్రసరణములు
వ్యాపింప నీయీవి యేపులు మాయును
బలి కల్ప శిబిరాజ విలసనములు
నెలకొన్న నీబాహు విలఁదాల్పఁ దడఁబడు
భుజగేంద్ర కమఠేంద్ర మూలగిరులు
సరస గుణ రాజి రాజిత సురసమాజ!
పూజితారుణ చరణ సరోజ! రాజ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- మొదటిపాదమున భగవత్కీర్తి విలసిల్లఁగానే పాలేరు శశి మరుద్వారణములు వెలవెల్లఁ బోవునని చెప్పఁబడినది కదా! అందు పాలేరు శశి, మరుద్వారణము లన్నియు అప్రకృతములే. వెలవెల్లఁబోవుట సాధర్మ్యము. కాగాఁ వానిలో వానికి ఔపమ్యము స్ఫురించినది గావున నిది తుల్యయోగితయైనది. తక్కిన పాదముల లోను ఇట్లే సమన్వయించుకొనునది.

# దీపకాలంకారము

స్వరూపము:- 'ప్రకృతాప్రకృత సముదాయ సంబంధియగు సమాన ధర్మము ఔపమ్యమును దీపింపఁ జేసిన దీపకమగును.'

ఉదా:- అమరసామ్రాజ్య సింహాసనాసీనుఁడు
పురుహూతుఁ డుగ్ర దంభోళితోడ
కైలాసగిరి వశాళి లీలా విభూషణ
మంచికేశుఁడు త్రిశూలంబుతోడ
సకల ధర్మాధ్యక్షు నారాగ్రికీర్తుండు
శమనుండు భయద పాశంబుతోడ
విపుల పృథ్వీ రాజ్య విరలాంఛన మూర్తి
భృగురాముఁ డురుశరాసనముతోడ
మెఱయు విశ్వంబు నందెల్ల నెఱలు సుఖము
శాంతివెన్నెల గాయు సుధాన్విత మణఁగు
రమ్యగుణధామ! సజ్జనారామసోమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ప్రకృతము శ్రీరామచంద్రుఁడు, అప్రకృతము పురుహూతాదులు. వారి సమాన ధర్మము దంభోళి మొదలగు ఆయుధములతో అమర సింహాసన కైలాసాదులపై మెఱసి లోక కల్యాణమును జేకూర్చుట. ఈ సమాన ధర్మమే శ్రీరామచంద్రునకును పురుహూతాదులకును ఔపమ్యమును స్ఫురింపఁ జేసినది. 'మెఱయు' యను ధర్మవాచకము అంత వాక్యగతమగుట నిది అంత దీపకము. ఆది మధ్య దీపకముల నిట్లే గ్రహింపునది.

## నిదర్శనాలంకారము

స్వరూపము:- "ఉపమాన ధర్మము ఉపమేయమునకుఁ జెప్పఁగా అవి యసంగతమై దానివలన నారెంటికిని బింబ ప్రతిబింబ భావమున ఔపమ్యము ఆక్షిప్తమైన యెడల నిదర్శనాలంకారమగును."

ఉదా:- మహిని త్వద్దోర్దండ మండలాగ్రము పొందు
శ్రీఖండ కుండలి శ్రీమహత్త్వ
సర్వ సర్వంసహా ఖర్వ ధూర్వహము నీ
భుజకోటి భుజగేంద్ర మూర్తి లీల
భూరి విక్రమ సారధీరంబు నీ మూర్తి
ధారుణీ భృద్రాజ మేరుదీప్తి
సుందర సత్కళా మందిరంబగు నీదు
మోము శారద పూర్ణ సోమ స్ఫూర్తి
పాలితాఖిల గోప! శర్వ ప్రతాప!
భానుకులదీప! శ్రీ ప్రణవస్వరూప!
రమ్యగుణధామ! సజ్జన రామసీమ!
విశ్వనుతనామ! గోపాల పేట రామ!

సమన్వయము:- ఉపమానమగు చందన వృక్షాశ్రయ సర్పము యొక్క విలాసములను ఉపమేయమగు రామచంద్రుని హస్తమందలి ఖడ్గము పొందెననుట సంగతము గాక ఆవిలాసములవంటి విలాసములను పొందెనని బింబ ప్రతిబింబ భావము ఆక్షిప్తమైనది గావున నిది నిదర్శనమైనది. ఇట్లే తక్కిన వాక్యములలోను సమన్వయించుకొనదగును.

## వ్యతిరేకాలంకారము

స్వరూపము:- 'ఉపమానముకంటె ఉపమేయమునకు ఆధిక్యము వర్ణింపఁబడిన వ్యతిరేకాలంకారము.'

ఉదా:-

రాహుకోరలఁ జిక్కి రాపిడి పడలేదు
దర్శఘటాచ్ఛాదితుఁడు గాదు
పగలు కాంతులు వెల్ల వాడిపోవుట లేదు
ఎరదీప్తి పక్షానఁ దఱుగఁ బోదు
తనస్థితికారుల యాధారమిక్కట లేదు
తనువల్లరి కళంకితంబు గాదు
వెలుఁగు స్వగతి రాత్రిచరముగాఁ బనిలేదు
పతితిన మన్మాదిఁ బాటులేదు
నిత్యమంగళ రోచుల నివ్వటిల్లు
రామసుగుణాబ్ధి గను యశోరాజమూర్తి
దివ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ గోపాలపేటరామ!

సమన్వయము:- చంద్రుఁడు రాహు కోరలలోఁ జిక్కుట, అమావాస్యతో ఆచ్ఛాదితుఁడగుట, పగలు కళలు తెలతెలఁ బోవుట మొదలగు లోపములు గలవాఁడు. రామచంద్రుని సుగుణాబ్ధిలోఁ బొడమిన చంద్రుఁడో నిష్కళంకుఁడు. దోషమాషితుఁడు కాఁడు. అని ఉపమానముకంటె ఉపమేయమునకు గుణాధిక్యము వర్ణితమగుట నిది వ్యతిరేకాలంకారమైనది.

## సహోక్త్యలంకారము

స్వరూపము:- 'ఉపమానోపమేయ భావము వివక్షితమై యుండి ఒక వస్తువునకు క్రియాన్వయమున ప్రాధాన్యము, మఱియొకదానికి సహార్థముగ అప్రాధాన్యసంబంధము నిర్దేశింపఁబడిన సహోక్తి యగును'

ఉదా:- కౌతుక మొప్పారఁ గౌశికు నెమ్మనఁ
దోఁచు పుల్కలతోన లేచినిల్చె
సిగ్గిల్లు భూపతి సింహాల నల్లని
వదనాలతోఁ బాటు వంగిపోయె
పద్మాక్షి జానకి పరిణయ రసోల్లాస
హృదయంబుతోన నాకృష్టమయ్యె
మేటి క్షత్రియ లోక మృత్యువు భార్గవు
పరిబల గర్వముతోన భగ్నమయ్యె
లీల నీ కేలఁ గీలించు నీలగళుని
చాప మారాం! సుకను తాటోప! భూప!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇట క్రియాన్వయమున చాపమునకు ప్రాధాన్యము. పులకలు మున్నగు వానికి అప్రాధాన్యము. పులకలు లేచినట్లు చాపము లేచినది. రాజ వదనములు వంగినట్లు విల్లు వంగినది. అని ఈ రీతిగా రెండింటికిని ఔపమ్యమును గమ్యమాన మగుచున్నది. కావున నిది సహోక్తి.

# వినోక్త్యలంకారము

స్వరూపము:- 'ఎందు ఏదేనొకటి లేకపోవుట వలన ఆవస్తువునకు రమ్యతయో, అరమ్యతయో గలుగునో యది వినోక్తి యగును.'

ఉదా:- పక్ష క్షయంబులు వడివీడుచో నెల
        నీమోము నాటిదై నిలువ వచ్చు
అడుగక యే యిచ్చు నౌదార్యమున్న నీ
        వులమాను నీ కేలిఁ బోలవచ్చు
మథితంబు గాదేని మహిత వారాశి నీ
        గాంభీర్యమున కెన గాఁగవచ్చు
కఠినంబు గాకున్నఁ గనకాద్రి వీఁక నీ
        యూరు జోడయి యాట లాడవచ్చు
నిత్య పరిపూర్ణ వితరణ నిరత చరిత
ప్రకృతి గంభీ! విజితారివార! ధీర!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాల పేటరామ!

సమన్వయము.- 'పక్ష క్షయములు లేకుండిన చంద్రుఁడు భవన్ముఖముతో సాటివచ్చును.' అనుచో చంద్రుండను వస్తువునకు పక్షక్షయము లేకపోవుట వలన రమ్యత గలుగునని చెప్పఁబడుట నిది వినోక్తియైనది. తక్కిన కల్పవృక్షాదుల విషయమునను ఈరీతి నే సమన్వయము నెఱుంగునది.

## సమాసోక్త్యలంకారము

స్వరూపము:- 'వర్ణ్యమైన వస్తువుయొక్క విశేషణాల సామ్యమువల్ల అప్రకృతమగు వస్తువు స్ఫురించెనేని సమాసోక్తి యగును.'

ఉదా:-
ఉల్లముల్ విరిసిల్లఁ జల్లని నీడల
నాదర మొప్పార నేదఁ దీర్చు
పాణాలు లేచిరా వీణాయితములైన
కలకంఠ నాదాలఁ బలుకరించు
తనివి దీరఁగఁ గమ్మఁ దనము మీరిన వన్నె
పూదేనె లందించి ముదము నించు
కోర్కె లీడేరఁగాఁ గూర్మి మగ్గిన పండ్లు
నారగింపఁగ నిచ్చి గారవించు
ఎల్ల తెరువరులు మిము గాంచి పల్లవించి
నెమ్మిఁ గుసుమించి ఫలియించి నించు ముదము
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- వనవృక్షములు అతిథులైన వారిని వివిధ రీతుల నాదరించి మన్నించును అను ప్రకృత వస్తు కథనము వలన ఆయా నీడ నిచ్చుట పలుకరించుట పూదేనియ లందించుట మున్నగు విశేషణ సామ్యమున్న అప్రకృతమగు భక్తులు భగవంతు నారాధించు ప్రకారము స్ఫురించుట నిది సమాసోక్తియైనది.

## శ్లేషాలంకారము

స్వరూపము:- 'కేవల ప్రకృతములకుం గాని, కేవలము అప్రకృతములకుం గాని, తదుభయములకుం గాని శబ్దమాత్ర సామ్యమున్నచో శ్లేషాలంకారమగును.'

ఉదా:- సన్మార్గమున ఠీవి సంచరించెడి వాఁడు
బుధ సమ్మోదమ్మునఁ బొలుచు వాఁడు
సుమనో మనఃప్రీతిదమ్ము సేయఁగల వాఁడు
పరిబలాంధకారంబుఁ బాపు వాఁడు
ఈశుఁడే తలఁదాల్ప నెసఁగు బింబము వాఁడు
దినదినమభి వృద్ధి నెనయు వాఁడు
కువలయ స్ఫూర్తులు గూర్చి వెలిగెడి వాఁడు
మృదు కరమ్ములఁ బర్వి మెఱయు వాఁడు
సుగుణముల పోల్కి నెఱ సొగసులకుఁ దావు
రాజనంగను దీపించు రామరాజు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇట రామరాజు ప్రకృతము, చంద్రుఁడు అప్రకృతము వీరికి సన్మార్గ సంచారము, బుధానుమోదము మొదలగు విశేషణములలో శబ్దసామ్యమున్నది గావున నిది శ్లేషాలంకారము. ఈ విశేషణము లన్నింటికి చంద్ర రామచంద్రుల పరముగా ఉభయార్థములను గ్రహించునది. ఇది ప్రకృతాప్రకృత శ్లేషకు ఉదాహరణము.

## పరికరాలంకారము

స్వరూపము:- 'విశేషణములు సాభిప్రాయములుగాఁ బ్రయోగింపఁబడిన పరికరాలంకారమగును'

ఉదా:-

కైలాస గిరివాసు కార్ముక కాండంబు
బెండు గావించె నే దండి మగఁడు
జమదగ్ని గర్వాగ్ని సాహసార్భటులిట్టె
చప్పన నార్చె నే గొప్ప జోదు
ఖరదూషణాదుల ఘోరపర్వతములఁ
గొనగోట గిల్లెనే కోదమపిసుగు
వాలి మహాభీల కాలోరగమ్మును
గ్రక్కించె ననువులే మొక్కలీఁడు
వాఁడె గండర గండఁడు వచ్చి పడియె
రాముఁడల్లదె! రావణా! రణ ధరిత్రి
వీఁకఁజూపుదె! యున నవ్వు వెకిలి నవ్వు
విశ్వనుత రామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇది రాముని అనుపానుపెఱిఁగిన రాక్షస శ్రేయోభిలాషియగు నొకమంత్రి రావణునికి చేయు హితోపదేశము. ఇందు రామునకు వాడిన విశేషణములెల్ల సాభిప్రాయములు. నీవు ఏడుగడయనుకొను ఈశ్వరుని విల్లే విఱచివైచెను. క్షత్రియ లోకమునెల్ల ఉట్టూతలూపిన పరశురామునే నిస్సారునిఁ జేసెను. నిన్ను తోఁకకు గట్టుకొని నాలుగు సంద్రములలోఁ గ్రుంకులిడిన మేటిని వాలిని ఒక్క కోలను కూలవేసెను. ఇఁక నీలెక్కయేమి? అని విశేషణముల యభిప్రాయము. కావున నిది పరికరాలంకారము.

# అప్రస్తుత ప్రశంసాలంకారము

స్వరూపము:- 'అప్రస్తుతమగు నొక వస్తువును జెప్పుట వలన సామ్య సంబంధమున ప్రస్తుత వస్తువు గమ్యమగునెడల అప్రస్తుత ప్రశంసాలంకార మగును.'

ఉదా.1
గ్రహజాలమెవ్వాని గృహదీప కళికలై
కొడిగట్టి గుడిగట్టి కునుకుచుండు
శుభ్రాంశుఁ డెవ్వాని చూపు మేరలు దాఁకి
మసిబిళ్ళయై మటు మాయమగును
తారక లెవ్వాని దరిసేఁగా రాక
మింటనెలదో మిను మినుకుమనును
పావకుఁ డెవ్వాని పజ్జకు రాఁజేత
గాక నల్లని తోవఁ దోఁక ముడుచు
భాసితాఖిలలోకుఁ డీభాస్కరుండు
వీని డాయఁగ ఖద్యోత! పూనుకొంటె!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇట ఖద్యోత ప్రశంస అప్రస్తుతము. దీనివలన ఖద్యోతము సూర్యుని దాఁకబోవు నట్టిదియే యగు రావణుని రామాభిద్రోహ కార్యము సామ్య సంబంధమున వ్యక్తమైనది కావున నిది అప్రస్తుత ప్రశంసయైనది.

# పర్యాయోక్త్యలంకారము

స్వరూపము:- 'ప్రకృత కార్య వర్ణనము చేత ప్రకృత కారణము వ్యక్త మైనయెడల పర్యాయోక్త్యలంకారమగును'

ఉదా:- చెక్కు చెదరవింత టెక్కెముల్ దిక్పాల
లీలావతీ చంద్రి శాలలందు
వసివాడ దిసుమంత పసలు మీఱెడి కల్ప
తరుకాండ కుసుమ మంజరులు నెంచ
వెల వెల్లఁ బోవింత వేలుపు జవరాండ్ర
కెందమ్ము చెక్కుల కెంపులెందు
రంగు మాఱవు సుంత రంగారు తపసుల
మోము దమ్ముల సౌరు మొలక లేఁత
శాసితారాతి పాలిత సత్యనీతి
రాజ్యమేలంగ రఘుకుల రామ విభుఁడు
రమ్యగుణధామ! సజ్జనారామసోమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- దిక్పాలుర పతాకలు చెక్కు చెదరకుండుట, కల్పవృక్ష మంజరులు వాడి పోకుండుట, దేవస్త్రీల గండములు పాలి పోకుండుట, మునుల మోమున నల్లదనము పుట్టకుండుట యను ప్రకృత కార్య వర్ణనము వలన రామచంద్రుఁడు దుష్టుఁడగు రావణుని దునుమాడెనను కారణము వ్యక్త మగుచున్నది. రావణుఁడున్నంతవరకు అమర పతాక లున్నచోట నుండుట, కల్ప మంజరులు వాడి పోకుండుట మున్నగు శాంతి చిహ్నములు లేవుగదా! కావున నిది పర్యాయోక్తి.

## పర్యాయాలంకారము

స్వరూపము:- 'ఒక ఆధేయము క్రమముగ అనేకాధారముల యం
దున్నను, ఒక ఆధారమునందు అనేకాధేయము లున్నను
పర్యాయాలంకార మగును.'

ఉదా:- నిగనిగ నొక్కుల నీలాల జాలు పె
న్నెరులను గేరు ముంగురుల పైన
ధగధగల్ గురియు మేల్ తాటంక రుచులతో
తనరారు చెక్కుటద్దముల పైన
తళతళ మెఱయు ముత్యాల సరమ్ములు
పసమించు మించుల పైటపైన
జిలిబిలిసారు మంజీరాల మొగ్గలు
విఱలెడి యడుగు దామరల పైన
వెలసి క్రొంగొత్త రీతులం గలికి సీతఁ
బ్రేమ లాలించు నీకేలు విశ్వమేలు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- శ్రీరామచంద్రుని కరము ఆధేయము. అది క్రమ
ముగా సీతాదేవి ముంగురులు మొదలగు ననేకాధారములయందు
వర్తిల్లినది గావున నిది పర్యాయమైనది. *

---

* 'ఆదికి శ్రీసతి కొప్పుపై, తనువుపై, నంసోత్తరీయంబుపై......'
అను పోతనామాత్యుని పద్యమును దీనికి ప్రసిద్ధోదాహరణమగును.

## పరివృత్త్యలంకారము

స్వరూపము:- 'సమన్యూనాధికములగు వస్తువులకు సమాధికన్యూన వస్తువులతో వినిమయముగలిగిన పరివృత్త్యలంకారమగును.'

ఉదా.- ఎంగిలి ఫలము లొసంగి చేకొనెఁదాను
దివ్య ఫలంబులు దెలిపి శబరి
అస్థిర కాయంబు నర్పించి తాఁగొనె
సమరకాయంబు జటాయువీర!
కడుమంచి మాటల యొడుపునఁ గాఁజేసె
కిష్కింధ భళిర! సుగ్రీవు నేర్పు
అంజలికే యఖిలాసుర రాజ్యంబు
విలిచె నయ్యారె! విభీషణుండు
ఇట్టి బేరాలు చేయఁగా గిట్టునెంత?
వచ్చు లాభాలు గూబల వఱకు గాదె?
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- శబరి మున్నగువారు శ్రీరామచంద్రునికి సమర్పించినవి యల్పమూల్యముగల వస్తువులు వారు గ్రహించినవో మహోన్నతములు కావున నిది పరివృత్త్యలంకారమైనది.

'వచ్చు లాభాలు గూబలవఱకు గాదె' అని నానుడిగా అనిన చనున్న మాట. దీని వలన అందటి చెవులవఱకు బారికు కీర్తియే లాభమను గూఢార్థము స్ఫురించుచున్నది.

## విశేషాలంకారము

స్వరూపము:- 'ఆధారములేకయే యాధేయమున్నదనినను, ఒక ఆధే యము ఒక సమయమునందే పలు తావులనున్నదని వర్ణించినను విశేషాలంకారమగును.

ఉదా:- కన్నుమూసిన భీము కరవాల హస్తుండు
మేలుకో భయద దంభోళిశాలి
పరువెత్త వెంటాడు పాశ భీకరపాణి
నిలుపులో లయకాల తరణిమూర్తి
ఈవైపు కోపారుణేక్షణ దుర్నిరీక్ష్యుఁ
డానైపు దావాన లాగ్ని కరుఁడు
ముందు వెన్కల కాల భుజగాసి బావావు
దల్పైన భీకర విలయకరుఁడు
కాఁగ శ్రీరాముఁ డుగ్రతేఁగనులఁ గట్టు
రణమునం దెందుఁ జూచిన రాక్షసులకు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలవిఠలరామ!

సమన్వయము:- దుర్నిరీక్ష్య తేజుఁడగు శ్రీరాముఁడే భయభ్రాంతు లగు రాక్షసులకు నెందుఁజూచినను గన్పట్టుట నిది ఒక ఆధేయము అనేకాధారములయందుండుటయును విశేషాలంకారము.

## పరిసంఖ్యాలంకారము

స్వరూపము:- 'ఒక విషయమున అనేకములకు ఒక్కమాటుగా సంబంధము గలుగుచుండఁ ఒక్కదాని సంబంధమును మాత్రమే నియమించుట పరిసంఖ్య యగును.'

ఉదా:- శీతంబు, జగదేక పూతంబు సితరుచి
స్ఫీతంబు నై యిలవెలయు నెద్ది?
సత్సాంగ బహులోక జిహ్వాగ్రంబుల యశ
శ్శ్లాఘ్యంబు బొంగను జాలునెద్ది?
హితుల నెల్లరను స్వాశ్రితుల నెల్లరను భూ
భృత్తుల నెల్లఁ బోషించు సతము నెద్ది?
క్షేమంబు కల్యాణ ధామంబు సురవైరి
భీమంబు నై యొప్పఁ బృథ్వి నెద్ది?
నెగడు నీకీర్తి, నీహేతి, నీకరంబు,
నీదు మూర్తియె యన్యంబు గాదుగాదు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- చల్లనిది, పవిత్రమైనది, తెల్లనిది ఏది? అని ప్రశ్న కలుగఁగనే వెన్నెల, మంచు, అమృతము, మందాకిని, రామకీర్తి యను పెక్కు వస్తువులు ప్రాప్తములైనవి. వీనిలో తక్కినవి గావని ఒక్క రామకీర్తికే తత్సంబంధమును నియమించుట నిది పరిసంఖ్యయైనది. ఇట్లే యిందలి తక్కినవాని విషయమును గ్రహించునది.

## సముచ్చయాలంకారము

స్వరూపము:- 'పలు గుణములకుఁగాని, క్రియలకుఁగాని ఒకచో సమావేశము వర్ణింపఁబడిన సముచ్చయాలంకారమగును.'

ఉదా: చేరుదు రెదలోనఁ గోరుదు రుదుభక్తి
మీఱుదు రిల నీదు మిత్రవరులు
పట్టుదు రసిఁగేల మెట్టుదు రాజిని
గిట్టుదు రాదాయ జెట్టిగములు
కూడుదు రొకతీరు వేడుదు రొకపాట
పాడుదు రాత్మ నీభక్తవరులు
ఎంతురు నిను నిశ్చయింతురు దేవు మో
దింతురు విజ్ఞులు స్వాంతమలర
సదమలాపాంగ సంగత శాంతిరంగ
నిఖిల విజ్ఞాన శృంగ ! శ్రీ నిర్మలాంగ !
దివ్యగుణధామ ! సజ్జనారామసీమ !
విశ్వనుతనామ ! గోపాలపేటరామ !

సమన్వయము:- ఇచట అనేక క్రియలకొకచో సమావేశము వర్ణింపఁబడినది గావున నిది సముచ్చయాలంకారము.

## తత్కారాలంకారము

**స్వరూపము.–** 'స్వతంత్రములగు పలు కారణములు చేరి ఖలేకపోతన్యాయమున ఒక కార్యమును సాధించిన తత్కారాలంకారమగును.'

**ఉదా:–**

విరిసిన తమ్ముల మురువునఁ దనరారు
నాయతమ్మగు గన్నుదోయి సొగసు
సిరికి నెలవుగాఁగఁ జెన్నారి కరమును
వెడదయై చూపట్టు నెడఁద తీరు
కడఁక జగములేలఁ గంకణమ్మును గట్టు
కరముల శంఖ చక్రముల వెల్గు
సోఁకుమూకలఁ జెండి వీఁక జేజేలను
దనియఁ జేసెడునట్టి పనితనంబు
నీవు పురుషోత్తముఁడవని నిర్వచించు
సామగానప్రియా! పూర్ణ సత్యకామ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

**సమన్వయము:** పద్మములవంటి కనులు, శ్రీనివాసయోగ్యమగు విశాల వక్షము, శంఖచక్రములు వెల్గు కరములు, దానవ సంహారము, విబుధ సంతర్పణము అనునవి యన్నియుఁజేరి శ్రీరాముఁడు పురుషోత్తముఁడను ఒక విషయమును సాధించినవి గావున నిది తత్కారాలంకారమైనది. దీనినే ద్వితీయ సముచ్చయమని విద్యానాథాదులు పేర్కొనిరి.

## సమాధ్యలంకారము

స్వరూపము:- 'కార్యసాధనమునకు ఒక కారణము ప్రవృత్తముకాఁగా కాకతాళీయముగ వేఱొక కారణముకూడ నొనగూడి కార్యమును సుకరమొనర్చిన సమాధియగును'

ఉదా:-

భీతి కన్నులమూఁతఁ బెట్టింప సాఁగఁగా
సుడిగాలి దుమ్ముల పడలు హెచ్చె
అంగ కంపమ్ము లెసఁగఁజాలదొ యేమొ
పుడమి గంపింపఁగా మొదలు వెట్టె
అతిశయిల్లఁగ గోఁతి యార్పులు గుండియల్
దడదడ లాడించె గడలి ఘోష
వాఁడి యమ్ములవాన వీడకుఁ దోడుగా
వినువాయి చిచ్చుఱ పిడుగులుమిసె
దానవుల కాజి నింకనో దానవారి
ధనువు బూనఁగ నీకేల యినకులేశ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- రణరంగమునుండి వచ్చిన యొక సేనాని శ్రీరామచంద్రునితో ననిన మాటలివి. భయమువలననే కన్నులు మూఁత పడుచుండఁగా కాకతాళీయముగా సుడిగాలి వీచి దుమ్ము కనులఁబడెను. దానవులోడిపోవుటకు భీతి కారణముగా ప్రవృత్తమైనది. కాకతాళీయముగా వచ్చిన సుడిగాలి దానికి తోడగుట దానవపరాజయము సుకరమైనది. గావున నిది సమాధియైనది. ఇట్లే తక్కిన పాదములలోను సమన్వయము తెలుఁగునది.

## వికల్పాలంకారము

స్వరూపము:- ' సమాన బలయుక్తములగు రెండింటికి ఒకచో ప్రాప్తికలుగఁగా విరుద్ధములగుటవలననది ఏకకాలమున ఏకస్థానమున ప్రాప్తిసంభవింపదు గావున వానిలో నేదేనొకదానికే సంభవము చెప్పిన వికల్పాలంకారమగును. '

ఉదా:- శిరములో మీపాణి శరములో వేవేగ
నేలఁ బెట్టుఁడు మహీపాలులార!
అడవులో రఘురాము నడుగులో ప్రీతితో
నాశ్రయింపుఁడు నెమ్మి (బ్రా)జ్ఞులార!
ఇరవులో పెద్దల పరువులో నిల్పఁగఁ
జాటువడుఁడు రాజ కోటులార!
పురములో దవిని కాఁపురములోఁ జేకూర
జతనమున్ సల్పుఁడో శత్రులార!
ఎడఁద నిసుమంత యోచించి యడుగు లిడుఁడు
బిగుదు మగలార! వీరాధి వీరులార!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలవిటరామ!

సమన్వయము:- ఉద్ధతులగు రామభద్రుని పరరాజులతో నను మాటలివి. శిరములు నేలఁబెట్టుట; శరములు నేలఁబెట్టుట; యను రెండు విషయములు శత్రురాజుల నెదుర్కొనిన సమస్యలు. రెండును ఉండుట కుదురదు. చేతిలో శరమున్నచో రామభటులోర్వరు. శిరము తెగి నేలఁబడితీరును. శిరమున్నచో చేతిలో శరముకూడదు. కావున రెండింటిలో నేదియో యొకటి నేలఁబెట్టుఁడు అని చెప్పుట నిది వికల్పమైనది. ఇట్లే తక్కినవి సమన్వయింపనగును.

## యథాసంఖ్యాలంకారము

స్వరూపము:- 'ప్రథమోక్తములైన వానికిని అనంతరోక్తములైన వానికిని నిర్దేశక్రిమమున సంబంధము నిబద్ధింపఁబడిన యథాసంఖ్యాలంకారమగును.'

ఉదా:-

శ్రీలుప్పొ పైబడ్డి చెన్నారినను చిన్న
వెలిదోఁచనీని గాంభీర్య గుణము
అఖిల భూభృద్వర్యు లాశ్రితదాసులు గాఁగ
స్తుత్యమై యొప్పు నౌన్నత్య గుణము
సర్వసర్వం సహా చక్రింబు కైదాల్చు
ప్రకటానమధురంధ రత్వగుణము
అర్థిలోక మనోరథార్థ సంసిద్ధిని
కరము గూర్చెడి సద్వితరణ గుణము
గాంచి నీకడ నాత్మల్గి కిటటి దలఁచు
వార్ధి గిరి శేష సురతరుల్ వ్యర్థమంచు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇందు ప్రథమోక్తములైనవి గాంభీర్యము, ఔన్నత్యము ధురంధరత్వము, వితరణము అనునవి. వీనికి అనంతరోక్తములైన వార్ధి, గిరి, శేషుఁడు, సురతరువు అనువానితో క్రమముగా సంబంధము నిబద్ధింపఁబడినది గావున నిది యథాసంఖ్యమైనది.

## కారణమాలాలంకారము

స్వరూపము:- 'పూర్వ పూర్వ వస్తువులు ఉత్తరోత్తర వస్తువులకు కారణములైనచో కారణమాలాలంకార మగును.'

ఉదా:- భూమిచేసిన భూరి పుణ్యంబు కతమున
నినకులంబొకటి సృష్టింపఁబడియె
ఇనవంశ మొనరించు ఘన సుకృతంబున
సిద్ధకీర్తులు ప్రభవిల్లిరందు
వరభాను కులజుల చిరపుణ్య పరిణతి
నభిరాముఁడగు రాముఁ డవతరించె
శ్రీరాము సత్కృతి శ్రీ నోము ఫలియించి
సీతా మహాదేవి చేయి దొరకె
జానకీ రామచంద్రుల సాంద్రకరుణ
వెల్లివారెను ప్రజల శ్రీలెల్ల దిశల
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇందు భూమిచేసిన పుణ్యము ఇనకుల సృష్టికిని, అయిన వంశముచేసిన సుకృతము రఘుదిలీపాది యశోధనుల యుదయమునకును, వారు గావించిన పుణ్యము శ్రీరామావతారమునకును, తత్సుకృతము జానకీ పాణిగ్రహణ యోగ్యతకును, ఆ పుణ్య దంపతుల కరుణ జగత్కల్యాణమునకును గారణమయ్యెనని పూర్వ పూర్వ వస్తువు ఉత్తరోత్తరమునకు కారణముగా నిరూపిత మగుట నిది కారణమాల యైనది.

## మాలాదీపకాలంకారము

స్వరూపము:- 'పూర్వ పూర్వ వస్తువు ఉత్తరోత్తర వస్తువునకు ఉత్కర్షా పాదకమయిన యెడల మాలా దీపకమగును.'

ఉదా:- ఆస్వాద మహిమచే నమల రసంబును,
తగురసోద్ధతిఁ గవితా విభూతి,
వరకావ్య దీప్తిని వాణీ విలాసము.
సరస వాచాలత సభ్యవరులు,
సభ్యవర స్ఫూర్తి సత్సభా భవనంబు,
సభఁ జేసి శ్రీరామ చంద్రమూర్తి,
శ్రీరామ భూపాలశేఖర నీచేత
వసుధ, యద్దానఁ బ్రపంచ మెల్ల
వెల్గుఁ యశములు రే వెల్గు వెల్గు పగిది
మెఱయు సిచ్చలు, భువనైక మిత్ర వర్య!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇదు పూర్వోపాత్తమైన రసము అనంతరోపాత్తమైన కవితకును, అది దాని పిమ్మట నుడివిన వాక్చునకును, అది సభ్యునకును, ఆ సభ్యుఁడు సభకును, ఆ సభ శ్రీరామచంద్రునకును, శ్రీరాముఁడు పిమ్మట చెప్పిన వసుధకును, వసుధ ప్రపంచమునకును ఉత్కర్షను గలిగింతురని వర్ణించుట నిది మాలా దీపకమైనది

## సారాలంకారము

స్వరూపము:- 'పూర్వ పూర్వ వస్తువుకంటె ఉత్తరోత్తర వస్తువు ఉత్కృష్టమైనచో సారాలంకారమగును.'

ఉదా:-

మహిం ఋతుమండలి మధురమౌ మధువగు
దానికంటెను పూవుదేనె మిగులు
పూదేనెకన్నను బాలుపాలు నమృతమ్ము
సుధకన్న రసకవి సూక్తి మెఱుఁగు
కవిసూక్తికంటెను కమనీయంబు నీవృత్త
మంతకంటెను నీదు యశము మిన్న
త్వత్కీర్తికన్నను దైవాఱు నీమూర్తి
నీమూర్తికన్న నీనామ మహిమ
మధురతమమగు గాన నే మాన్యులిలను
గూర్మి నిత్యము దానినే గొల్చుచుందురి
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇట పూర్వ పూర్వము లుక్తములైన వసంత ఋతువు, మొదలగు వానికంటె ఉత్తరోత్తరము నిర్దిష్టములైన తేనె మొదలగు నవి మధురములనియు, అన్నింటికంటె శ్రీరామ నామము మధురమైనదనియు వర్ణించుట నిది సారాలంకారమైనది.

# ఏకావళ్యలంకారము

స్వరూపము.- 'పూర్వపూర్వమునకు ఉత్తరోత్తరము క్రమముగా విశేషణమయ్యేని ఏకావళియగును'

ఉదా:- పరిణత భావైక పండితు లవ్వార
లెవ్వారు హితము గుర్తింపఁగలరో!
అఖిల విద్వన్నుతంబగు హితమయ్యది
య్యేది సుజనుల రంజిల్లఁ జేయు!
శోధింప ధారుణి సుజనులా జనులౌదు
రేరు సాధువులని పేరుగాంతురు!
సర్వాభిమతమైన సాధుత్వ మగునద్ది
య్యెద్ది రామునికృప నెనఁగఁజేయు!
మేలు మదినెంచి సాధులై మెలఁగుడంచు
నార్యు లెల్లెడ బోధింతు రనవరతము
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- 'వీరు పండితులు' అను పూర్వవాక్యమునకు 'ఎవరు హితము గుర్తింతురో' అను ఉత్తరవాక్యము విశేషణమయినది. అట్లే తదనంతర వాక్యమునకు దానిముందు వాక్యము విశేషణము, దానికి తదుత్తర వాక్యము విశేషణము ఈరీతి పూర్వపూర్వమునకు ఉత్తరోత్తరము విశేషణమగుట నిది ఏకావళియైనది.

## కావ్యలింగాలంకారము

స్వరూపము:- 'హేతువు వాక్యార్థరూపముగాఁగాని, పదార్థరూపముగాఁగాని నిర్దిష్టమగుచో కావ్యలింగాలంకారమగును.

ఉదా:-

విప్పారె తీవెలు వేయ సాఁగెను కళా
సంపదల్ నీకృపా సాంద్ర మొలికె
వృజిన తమస్సులు విచ్చిపోవఁగ సాఁగె
నీముఖ కాంతులు నివ్వటిల్లి
అరిరాజ సాధ్వస మడుగంటెఁ దావక
దివ్యశాసన మహా తేజమొసఁగి
ప్రజలు సుప్రజనులై వర్ధిల్ల సాఁగిరి
భవదీయ పాలన ప్రాప్తి మెఱసి
రాజు వెన్నుని రూపన్న రమ్యసూక్తి
స్థేమ మొనగూర్చి నిల్పితి భూమహేంద్ర
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటధామ!

సమన్వయము:- ప్రజలకు కళావికాసము, తమోనిర్మూలనము, అభయము, సంపత్సమృద్ధి కలిగెను. వానికి హేతువులగు భగవత్కృపా సాంద్ర ప్రసారాదులు విశేషణగతములై నిర్దిష్టములైనవి కావున నిది కావ్యలింగమైనది.

## అర్థాంతరన్యాసాలంకారము

స్వరూపము:- 'సామాన్యము విశేషముచేగాని, విశేషము సామాన్యము చేగాని సమర్థింపఁబడిన అర్థాంతరన్యాసాలంకారమగును.'

ఉదా:-

గంతులో కడలేని కడలి దాటఁగనేర్చె
పిడికిట లంకిణిఁ బిలుకుమార్చె
చిటికెలో రాకాసి జెట్టి ప్రోలునఁ జొచ్చె
నెమ్మి నుంగరము సీతమ్మకిచ్చె
ఊఁపులో పూఁదోఁట యేపు గీపులుమాపె
దరియు రక్కసుల పోతరముమాపె
మాటలో లంకను మసిమసి గావించె
అమ్మ సేమము చెవులారవించె
ఎంతలెంతలు చేసె నీయింత హనుమ!
ధర మహాత్ములకెందు దుష్కరము గలదె!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- హనుమంతుని సముద్రలంఘనాదులు విశేషము. ఇది 'మహాత్ములకు దుష్కరముగలదా?' యను సామాన్యముచే సమర్థింపఁబడినది. కావున నిది అర్థాంతరన్యాసమైనది.

## అనుమానాలంకారము

స్వరూపము:- 'సాధ్యప్రతీతికొఱకు సాధన నిర్దేశము చేసిన అనుమానా లంకారమగును.'

ఉదా:- తమ్ముఁడా! లక్ష్మణా! పొమ్ము! వృక్షమ్ముల
  దండకు నీమేన నెండదాఁకు
అన్న! యెండా? యేది? యగపడకున్న దే;
  అదె! యటుగను! సూర్యుఁడుదయ మొందు,
సోదరా! రేయెందు సూర్యుఁడు వొడుచునా?
  చక్కనియాతఁడు చంద్రుఁడగును,
వత్స! నీవెట్టుల వనజారి యితఁడందు?
  వదినొ! కురంగంబు గదియుగాదె!
హా! కురంగాక్షి! చంద్రాస్య! యడవినెచట
నుంటివోయని కుందుట యొక్క లీల?
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- సీతావియోగతప్తుఁడగు రామచంద్రునకు చంద్రోదయము సూర్యోదయముగాఁ దోఁచినది. రామలక్ష్మణులకు పై విధముగ సంభాషణము జరిగినది ఇందు కురంగమువలన ఆ యుదయించునది చంద్రుడు అని లక్ష్మణుఁడు అనుమాన ప్రమాణము చే గనుగొనెను. సాధ్యము చంద్రుఁడు; తత్ప్రతీతికి సాధనము కురంగము నిర్దేశింపఁబడినది. కావున నిది అనుమానాలంకారమైనది.

## ఆక్షేపాలంకారము

స్వరూపము:- 'ఒకానొక విశేషాభిప్రాయమును సూచించుటకై ఉక్త విషయమునే గాని, వక్ష్యమాణ విషయమునే గాని నిషేధించినట్లు తోచునట్లు పలికినచో ఆక్షేపాలంకారమగును. అనిష్ట విధ్యాభాసము కూడ ఆక్షేపమే యగును.'

ఉదా:-
బందీలుగా ముని బృందమ్ములం దెమ్ము!
ఏమి వృత్తి మేము నేర్వంగ వలయు
నిలువు దోపుగ వేల్పు కలికి మిన్నల సొమ్ము
తే తెమ్ము! చివరికై నేత లివ్వ
వన్నెల చిన్నారి కిన్నెరి కన్నెలం
గొని రమ్ము! సురగీతి వినఁగ వలయు
పొమ్ము! రామునితోడఁ బోరాడ మేమి దే
నందనమున వేచి యుందుము చట
సకల దానవ పూజిత చరణ! యనెడి
నాతిఁ గని రావణుఁడు వెడ నవ్వు నవ్వ
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇది అనిష్ట విధ్యాభాసరూపమగు ఆక్షేపమునకు ఉదాహరణము. సజ్జన సంక్షోభము, దేవతలకపకారము, రామునితో వైరము అనునివి అనర్థ హేతువులు గావున మండోదరికి ఇష్టము కావు; అయినను భర్తకు చెప్పిచెప్పి విసికి నిష్ఠురముగా మంచిది! సజ్జన సంక్షోభము చేయుము! రామునితోఁ బోరుము! అని అనిష్ట విధిని చేయుచున్నది. ఈ విధి ఆభాసమేయని 'వనవృత్తి' 'నేర్వవలయు' మొదలయిన వాక్యములతో తెల్లమగుచున్నది. నాశహేతువులగు నీ దుష్కార్యములు చేయవద్దని పరమతాత్పర్యము.

## వ్యాజస్తుత్యలంకారము

స్వరూపము:- 'వాచ్యమగు నిందచే స్తుతిగాని, స్తుతిచే నిందగాని స్ఫురించిన వ్యాజస్తుత్యలంకారమగును.'

ఉదా:-

చివికె జీర్ణంబైన శివుని విల్లు విఱచుటా!
చేయి తిరుగు జోదు చేయుచేత
కాకంబుపైఁ జూపు వీఁక పోకడలట్టి!
పేరొందు జగజెట్టి బీరతనము
మూఁడుకాళ్ళ ముసలి ముక్కు రక్కించుటా!
మొనగాండ్ర మురిపించు కొంగగుర్తు
నీతికి సెలవిచ్చి కోఁతి వేఁటాడుటా!
మేటి గండని కేలి మేలిచిన్నె
తెల్లమగు లెమ్ము నీపస విల్లువట్టి
లోకభీకరు రావణు దాఁకువేళ
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇందు రామ విషయకమైన నింద వాచ్యముగానున్నది. కాని దానివలన శివధనుర్భంగాద్యనితర సాధ్యములగు కార్యములను గావించిన జగదేక శూరుఁడు శ్రీరామచంద్రుఁడు అని స్తుతియే పర్యవసన్నమగుచున్నది. కావున నిది వ్యాజస్తుతియైనది

## విరోధాభాసాలంకారము

**స్వరూపము:-** 'పైకి విరోధమున్నట్లు గన్పడి పర్యవసానమున [విరోధ]ము పరిహరింపఁబడిన విరోధాభాసాలంకారమగును'

**ఉదా:-**

పురుషోత్తము ఖ్యాతిఁ బొందుచుందువు
చతురాననుఁడవయ్యు సతము నీవు
జైవాతృకాభిధ జగతి వెల్గుదువౌర!
ఘనవరలోక భాస్కరుఁడవీవు
రాజవరాళి వసఁగ రాజిల్లుచుందువు
శ్రీ కాంతుఁడను పేరు చెందనీవు
గోత్రివర్ధకుఁడవై గోమురారుచుందువు
జిష్ణు ప్రసిద్ధినిఁ జెలఁగినీవు
చిత్రిచిత్రము! దశరథ పుత్రినీడు
నిజ చరిత్రము తెలియఁగా నేర్చునెవఁడు?
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలసేటరామ!

**సమన్వయము.-** పురుషోత్తముఁడైనవాఁడు చతురాననుఁడగుట పొసగదని పైకి విరోధముదోఁచినది. కాని పురుషులలో శ్రేష్ఠుఁడు, సుందరమగు వదనము గలవాఁడు అని అర్థాంతరము దీయఁగా పర్యవసానమున విరోధపరిహారమగుట నిది విరోధాభాసమైనది. ఇట్లే జైవాతృకాది పదములకును విరోధ తత్పరిహారముల నూహింపనది.

## విశేషోక్త్యలంకారము

స్వరూపము :- 'కార్యోత్పత్తికి వలయు కారణ సామగ్రియున్నను కార్యముత్పన్నముగాకున్న విశేషోక్తియగును.'

ఉదా :- తన వాక్కు సురరాజ ఘనరత్న దీపిత
 మౌళి రాజిలు దివ్య మాలగాఁగ
తన కంటి కెంజూపు ధరణీతలంబెల్ల
 నట్టుడికించు దావాగ్నిగాఁగ
తన పేరు దర్పాఢ్య దైతేయ కోటికి
 దరికొన్న వజ్ర పంజరముగాఁగ
తన హేతి శాత్రవ త్రాణ భీతికి మూల
 హేతువు పెను ధూమ కేతుగాఁగ
ప్రభుత, శౌర్యము, కడుపల్కుబడియు, బలము
గలిగియును రావణుండేల తలఁకు విడఁడొ?
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము :- రావణునికడ ధైర్యముతో నుండుటకు కావలయు సర్వ సామగ్రియుఁగలదు. ప్రభుత్వము, శౌర్యము, పలుకుబడి బలము అనునవి గలవు. అయినను భయమువీడుట లేదు. ధైర్యము గలుగ లేదు. ఈరీతి కారణమున్నను కార్యముగలుగకుండుట నిది విశేషోక్తియైనది.

## విభావనాలంకారము

స్వరూపము:- 'కారణము లేకుండఁగనే కార్యోత్పత్తి గలిగిన విభావనాలంకారమగును.'

ఉదా:- దట్టంపుఁ జీకటుల్ నట్టాడె రట్టడి
రాకాసిపురి నిసి కాకమున్నె
గాసి మబ్బులు మూఁగి కమ్మె రేద్రిమ్మరి
దివిఁ దొల్కరియింక దిగకమున్నె
దండి యారువుదిండి గుండియల్ వ్రీలెను
వాఁడి కోలలు మీఁదఁ బడకమున్నె
రక్కసి జోదుల యుక్కు గొండలు గూలె
పిడుఁగు వాల్గోఁతలు పడకమున్నె
పోతరంబున నలుదెసల్ కోఁతిమూక
మించి లంకను వడి ముట్టడించె ననఁగ
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- రామదండు ముట్టడించఁగనే లంకలో వింతలు ప్రారంభించినవి. రాత్రిగాకమునుపే చీకట్లు గ్రమ్మెను. తొలకరి రాకముందే మబ్బులు మూఁగెను. బాణములు తగలకమున్నే ప్రాణములుపోయెను. పిడుగులు పడకముందే కొండలుగూలెను. ఇట కారణములగు రాత్రి మొదలగునవి లేకుండఁగనే కార్యములగు చీకట్లు మున్నగునవి గలిగెననుట నిది విభావనాలంకారము.

## విషమాలంకారము

లక్షణము:- 'కారణ విరుద్ధ కార్యోత్పత్తియైనను, ఇష్టప్రాప్తికై యత్నము సేయ ననిష్టోత్పత్తి గలిగినను, విరూపవస్తు సంఘటన యైనను విషమాలంకారమగును.'

ఉదా:- రమణీయ మణిమయ ప్రాసాద తతులేడ
విషమ కంటక వన వీథులేడ
కాకలీ వల్లకీ కమ్రగీతములేడ
విరసమ్ములౌ శివా విరుతులేడ
మధుర మధురములౌ మహితాన్న రుచులేడ
అతిహీన కందమూలాదులేడ
వరహంస తూలికా పర్యంక తలులేడ
దారుణ పాషాణ తలములేడ
మూర్తు లివియేడ ! ఏడ నీమూర్తులందురి
వనుల నీ దాయలను గాంచి వనచరాళి
రమ్యగుణధామ ! సజ్జనారామసీమ !
విశ్వనుతనామ ! గోపాలపేటరామ !

సమన్వయము:- ఇది విరూపవస్తు సంఘటన రూపమగు విషమాలంకారమునకు ఉదాహరణము. సమస్త వైభవముల ననుభవించిన శత్రురాజులకు బహుళ దుఃఖాకరమగు అరణ్యావాసము సంఘటిల్లినది. కావున నిది విషమమైనది.

## సమాలంకారము

స్వరూపము:- 'అనురూపములగు వస్తువులకు సమావేశము గలిగించిన సమాలంకారమగును.'

ఉదా:- తరుణ వసంతునిఁ దరుణేందువదన లక్ష్మి
నేర్చి పూపందిళ్లఁ గూర్చినాఁడు
పూవింటి యొడయనిఁ బూఁబోఁడి రతికన్య
కేలు కేల్సంధిపఁ జాలినాఁడు
చెన్నారు శీతాంశుఁ జిన్నారి చంద్రికఁ
జెలువారఁ గళలేలఁ గలిపినాఁడు
శ్రీరామచంద్రుని సింగారి జానకి
నోడఁగూర్చి భద్రిముల్ వడసినాఁడు
తమ్మి పూవింటఁ బుట్టిన దంట యెంత
నలఁతియని చూచుఁ గ్రేగంట వాణి విభుని
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇట అనురూపులగు వనలక్ష్మీ వసంతులకును, రతీమన్మథులకును, చంద్రికాచంద్రులకును, సీతారాములకును సమావేశము వర్ణింపఁబడుట నిది సమాలంకారము.

## అధికాలంకారము

స్వరూపము:- 'ఆధారము అల్పముగను ఆధేయము అధికముగను వర్ణించినచో అధికాలంకారమగును'

ఉదా: సన్నము భవదీయ నిర్మల చరితంబు
స్వల్పాది కవిసూక్తిఁ బట్టుటయును
అతివేల భవదీయ వితత స్వరూపంబు
చిన్ని వదానులమదిఁ జిక్కుటయును
మహనీయ భవదీయ మంజులకీర్తు లా
యలంతి భక్తులగీతి వెలయుటయును
సైరంధ్రి భవదీయ నిర్వ్యాజ కరుణాబ్ధి
గోరంత పాత్ర్యానఁ గూడుటయును
చూచి మదినెంచి యోచించి చోద్యమంది
ముగ్ధులగుదురు జ్ఞాన విదగ్ధులిలను
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇట అపారమగు భగవచ్చరితము అల్పమగు కవిసూక్తి నిబట్టినదని ఆధారాధేయములకు అసామాన్యము వర్ణింపఁబడుట నిది అధికాలంకారము. తక్కిన ఆధారాధేయములను ఇట్లే యెఱుంగునది.

## అసంగత్యలంకారము

స్వరూపము.- 'కార్యకారణములకు భిన్న దేశావస్థితి చెప్పఁబడెనేని అసంగత్యలంకారమగును.'

ఉదా:- ఇనవంశమున శ్రీరమేశుఁడు కాలూన
సురవైరి హృదయాలు బరువులెక్క-
జానకీపతి ధనుర్జ్యాకోటి మీటఁగా
కుటిల రక్షస్సతీ ఘోష లెసఁగె
పట్టాభిషేకంబు వఱల శ్రీరాముని
కమరుల హృదయ తాపములు వాసె
దశరథ సూనుండు ధరణి భారము మోయ
సోఁకుల కుసుపుసుప్పరులు హెచ్చె
ఎంత యాశ్చర్యమనుచు మునీశులాత్మ
నెంచి నీవృత్తములను గీర్తించుచుందు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- భగవంతుఁడు శ్రీరాముఁడై కాలూనినది యినవంశమున; బరువెక్కినది సురవైరి హృదయాలు. కాలూనినచోట బరువెక్కవలయును. అట్లుగాక ఇట కారణము ఇనవంశమున, కార్యము రాక్షస హృదయాలలోను అగుట నిది యసంగతి. ఇందలి తక్కిన వాక్యములలోను ఈయలంకారము నిట్లే యెఱుంగునది.

# యుక్త్యలంకారము

స్వరూపము:- 'దుర్ఘటార్థములను ఘటింపఁజేయు నెడల యుక్త్యలంకారమగును.

ఉదా:- శాంతా శరీరంబులు చట్టుబండలు సేయు
అలజన స్థాన దైత్యావళిజంబు
గర్వంపు పిల్లునఁ గన్నులు పొరలెక్క
తూలు సధర్ముఁడా వాలిపొగరు
తరఁగ చేతులుసాఁచి దాఁటనీయనటంచు
పొంగిన యావార్థి పొత్తరంబు
ముల్లోకములనేలు మొనగాఁడనేనని
విఱ్ఱవీఁగు దశాస్యు బీరతనము
తుడిచిపెట్టితివఁట! యొకతూపుతోనె
అఖిల ఘటనాఘటన సమర్థా! మహాత్మ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- అఖిల దుష్టగర్వ నిర్వాపణమను దుర్ఘట కార్యమును ఒక్క శ్రీరామబాణము ఘటిల్లఁజేయుట నిది యుక్త్యలంకారమైనది.

## విచిత్రాలంకారము

స్వరూపము:- 'స్వవిరుద్ధ ఫలమును బొందుటకై యుద్యమించుట విచిత్రాలంకారమగును.'

ఉదా.-

అమరేంద్రుఁ డైరావతముడిగ్గి నినుఁ గొల్చు
మక్కువ సురదంతి నెక్కు సతము
సుగ్రీవుఁడింత సతిగ్రీవుఁడగునీకు
తలయెత్తి కపిరాజ్య తలము నేల
దశముఖానుజుఁడు నీదాసుఁడయ్యెనుగోరి
దాసులై దనుజులు దన్నుఁ గొల్వ
పరమరాగంబునఁ బ్రస్తుతింతురు మునుల్
రేఁగిన రాగంబు ద్రెంప నెంచి
అఖిల కల్యాణ గుణ నికరాలవాల
ఆర్తమందార! ధీర! స్వర్ణాద్రిసార!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇట 'సంతతము నైరావతమెక్కి తిరుగుటను నైరావతమును దేవేంద్రుఁడు దిగెను' అన్నచో గజావరోహణమునకు గజారోహణము విరుద్ధమైన ఫలము; తదర్థముద్యమించెను కాన నిది విచిత్రాలంకారము. నమ్రుఁడై భగవత్సేవచేసి స్వారాజ్యమును నిష్కంటకముగా ఇంద్రుఁడేలునని తత్త్వార్థము. ఇందలి తక్కిన వాక్యములకును ఇట్లే సమన్వయము.

## భావికాలంకారము

స్వరూపము :- 'అత్యద్భుత వస్తువర్ణనము వలన భూతభావ్యర్థములు భావిక వ్యాపారమునకు ప్రత్యక్షములైనట్లు తోచిన భావిక మగును.'

ఉదా:-

మోహపెట్టునోయని చూపులు నిగిడించి
చూచు నృపతులట్టె చూచుచుండ
ఇట్టె విల్లెత్తు మాచిట్టిజోదని గాధి
పట్టి యెత్తిన చేయి యట్టెయుండ
జోదు సింగపు దూఁకుఁ జూచు సింగముపోల్కి
నడలేచు లక్ష్మణుం డట్టెయుండ
మీరి తియ్యని కోర్కె లీరికలెత్తంగ
పొంగు జానకి యట్టె పొంగుచుండ
శివుని విల్లెత్తునాఁటి నీ చెన్నురూపు
కనుల గట్టును నేఁడు నో కమలనయన!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- అనన్యసాధ్యమగు శివధనుర్భంగము అద్భుతవృత్తము. దానిని వర్ణించుట నాఁటి సభావృత్తము భావిక మనోవీథని భావితమై ప్రత్యక్షాయమాణమగుట నిది భావికాలంకారమైనది.

—

## అన్యోన్యాలంకారము

స్వరూపము:- 'పరస్పరము రెండింటికి కార్యకారణ భావము వర్ణింపఁబడెనేని అన్యోన్యాలంకారమగును.'

ఉదా:- శోభిల్లె జానకి శూరు రాఘవుఁజేరి
వైదేహితో రామ భద్రుఁడెసఁగె
విలసిల్లె వాల్మీకి పలుకు రామునిఁబాడి
రాముఁడ వ్వాల్మీకి రసనఁజెలఁగె
అలరారె నినకుల మవనిజా పతిచేత
నినకులంబున నిందిరేశుఁడలరె
దనరె దశాస్యుండు ఘనురాము నెదిరించి
తొడరె రాముఁడు వాని ద్రుంచివైచి
పొలుచునన్యోన్య భూషణ భూష్యభావ
మీవిధంబున మీకు నో దేవదేవ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- జానకి శోభిల్లుటకు శ్రీరామచంద్రుఁడు కారణము. శ్రీరామచంద్రుఁడు విలసిల్లుటకు సీతాదేవి కారణము. అని పరస్పరము సీతారాములకు విలసనమున కార్యకారణభావము వర్ణింపఁబడుట నిది అన్యోన్యాలంకారమైనది. ఇతర వాక్యములలోను అలంకారసమన్వయ మిట్లే చేసికొనవలయును.

## సామాన్యాలంకారము

స్వరూపము:- 'గుణసామ్యమున ఒక వస్తువునకు మఱియొక వస్తువు యొక్క తాదాత్మ్యము స్ఫురించినచో సామాన్యాలంకారమగును.'

ఉదా:-
ఐరావతంబేది యనుచు దంతావళం
బిదియన్న భేదంబు తెలియరాక
ఉచ్చైశ్శ్రవంబిద్ది తెచ్చు గుఱ్ఱములివ్వి
యని వేఱువేఱుగా ననఁగరాక
క్షీరసాగరమిద్ది నీరాశి యిదియని
విడఁదీసి పేర్కొన వీలుగాక
కల్పవృక్షము లివ్వి యల్పవృక్షములివ్వి
యని గుర్తుపట్ట సాధ్యంబుగాక
వింతపడుదురు విబుధులు స్వాంతమందు
నిర్మలంబైన నీకీర్తి నిండ జగము
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- శ్వేతగుణ సామ్యమున ఐరావతాదులగు వస్తువులకును అన్యగజాదులకును భేదముపోయి అన్నియు సమానముగాఁ దోఁచుట నిది సామాన్యాలంకారము.

గమనిక:- వస్తువుచే వస్తువు తిరోహితమైన యెడల మీలనమనియు, గుణముచే వస్తుతాదాత్మ్య ప్రతీతి గలిగిన సామాన్యమనియు గుర్తింపఁదగును.

# స్వభావోక్త్యలంకారము

స్వరూపము:- 'ఉన్నదున్నట్లుగాఁ గనులకుఁ గట్టినట్లు సహృదయాహ్లాదజనకముగాని వస్తువర్ణనము స్వభావోక్తియగును.'

ఉదా:- గికురించి పరువెత్తి యొకతీరు మెడఁద్రిప్పి
వెన్నంటు నీపైనఁ గన్నువెట్టి
అమ్ముపైఁ బడెడి భయమ్మున వెనుసేను
మునుమేన నొదుగఁగా ముడిచిముడిచి
ఇసుమంత కొఱికిన కసవు తోరివలజార
మీఱు దప్పికనెంతు నోరుదెఱచి
వడిఁగోళ్ళు దూఁకుటఁ బుడమిపై నొక్కింత
మిక్కిలి గామింటఁ జక్కఁబాఱు
పసిఁడి లేఁడిని గుఱివెట్టి నొసలు ముడిచి
కంటి నఱమోడ్చి వెంటాడి తంట; దంట!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇట వేటకాఁడు వెన్నంటిన తఱినుండు లేఁడిస్థితియు వెన్నంటిన వేటకాని స్థితియు స్వభావసిద్ధముగ వర్ణింపఁబడుట నిది స్వభావోక్త్యలంకారము.

# వ్యాజోక్త్యలంకారము

స్వరూపము:- 'గుప్తమగు నొక వస్తువు వ్యక్తము కాఁగా దానిని మఱియొక వ్యాజమున గుప్తపఱచుట వ్యాజోక్తి యనఁబడును.

ఉదా:-

చెలియరో! పుప్పొడి యొలికె పాపము! సీత
తమ్మి కన్నులు గను! చెమ్మగిల్లె
పల్లవాధర! చూడు! చల్లని పన్నీరు
చిల్క జానకిమేను పుల్కరించె
నలినాక్షి! ఈముగ్ధ నిలువవేదెన్నఁడు
నల్వురలో సిగ్గు చెల్వు గంటె!
కుటిలాలకా? దీని నిటల రత్నప్రభల్
చెక్కుల నలమె కెంపెక్కఁగాదె!
అంచు తనచిన్నెలను సమర్థించు సఖిని
లీలఁ గనెనట! మీపెండ్లివేళ సీత
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- రమణీమణి జానకికి శ్రీరామగుణభావన సందర్శనముల వలన రోమాంచాశ్రుపులకాదులగు సాత్త్వికభావములు పొడమినవి. వాని నెట్టెట్లో గోపనము చేసికొనినది. కాని వివాహ వేదికపైకి వచ్చునరికి అసాత్త్వికోజ్జృంభణము ఆఁగలేదు. ఆ స్థితిని గనిపెట్టి యొక గడుసరి చెలికత్తె వానిని అన్యథాసమర్థించి మఱుగుపఱచినది గావున నిది వ్యాజోక్తియైనది.

# వక్రోక్త్యలంకారము

స్వరూపము:- 'ఒకరు ఒక యుద్దేశముతో ప్రయోగించిన వాక్యమును కాకువుతోఁగాని శ్లేషమహిమనుగాని వేఱొకరు మఱియొక తీరున అన్వయింపఁజేసిన వక్రోక్తియగును'

ఉదా:- కోపంబు గన మరుచాపంబ నీకేల?
కలకంఠి పలుకవే కమ్మపలుకు
చాలు నన్నృతమింక! కేలఁచాపం బేది?
కలకంఠి గలదు మాయలరుఁదోఁట,
మావల్ల నేవైన మహితాపచారముల్
గల్గుచో మన్నించు గాంచనాస్య!
సిరిమాకు నపకృతుల్ సేసినదని మేము
మొరవెట్టు కొంటిమే దొరలమోల
అనుచు చతురాస్య మాటల కందకున్న
ప్రణయ ముగ్ధతఁ జూతువె! పడఁతిసీత
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇందు శ్రీరామచంద్రునిచే ఒక యభిప్రాయముతోఁ బ్రయోగింపఁబడిన పదములకు శ్లేషమహిమను సీత వేఱొకయర్థమును దీసి సల్లాపమును బెంచి ఉక్తివైచిత్రిమును జూపుట నిది వక్రోక్తియైనది.

## ఉత్తరాలంకారము

స్వరూపము:- 'ఉత్తరమువలన ప్రశ్న యూహింపఁబడిన ఉత్తరాలంకారమగును.'

ఉదా:-

వెడ కేకలను వేయు నడవి నెమిలిగాని
　　నీవాడు పెంపుడు నెమలి గాదు
కుప్పిగంతులు వేయు కొన దుప్పియెగాని
　　కూడియాడఁగ మన లేఁడిగాదు
చేరఁ గుమ్మఁగ వచ్చు కాఱు ఏనుఁగుగాని
　　కోరాడ మన యేన్గు గొదమగాదు
చెదరి పర్వెత్తెడి బెదరు చిల్కయెగాని
　　పలుకఁగా నీచేతి చిలుకగాదు
వత్స! వనమిది; మన యుపవనముగాదు
కాద టందురు నీయరుల్ గాననముల
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- అరిమర్దనుఁడగు రామునివలని భయమున స్వనగరములను వీడి మహారణ్యములలో నెచటనో కుటుంబసహితముగాఁ దలదాఁచుకొనుచుండు దానవులలో నొకఁడు తన కుమారునితోననిన మాటలివి. ఈ యుత్తరమువలన నాయనా! ఈ నెమిలి, లేఁడి, ఏనుఁగు చిలుక యేదియు నా కడకు రాదేమి? నాతో ఆటలాడదేమి? అని తండ్రిని కుమారుఁడు ప్రశ్నించెనని తెలియుచున్నది గావున నిది యుత్తరాలంకారము.

# ప్రత్యనీకాలంకారము

స్వరూపము:- 'ప్రబలుఁడగు శత్రువునకుఁ బ్రతీకారము సేయలేక తదీయునకపకారము సేయుట ప్రత్యనీకమగును.'

ఉదా:- నిన్నెదిర్పఁగ రాక నీకులపూరుషు
 రవిఁబట్టి రాహుచే రట్టుసేయు
నీమ్రోల నిలువఁగా నేరక నీపేరు
 గనుపట్టు చంద్రుని గాసిపెట్టు
నిను చెనకఁగలేక కనుకొని నిన్గొల్చు
 భక్తుల బాధల పాలుసేయు
నిన్ను దాఁకఁగ గుండె నిబ్బరంబులు లేక
 నీపక్షమని యింద్రు నేపు మాపు
అల్పగుణుఁడైన శత్రువు సదరిపాటు
లిట్టులున్నవి! వేవేగ మట్టుఁబెట్టు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- రావణాసురుని దౌష్ట్యమును రామునితో విన్నవించి తన్నాశనమునకై రామునిఁ బురికొల్పు నొక తాపసి వాక్యములివి. ఇందు రావణుఁడు ప్రబలుఁడగు శ్రీరాము నేమియుఁ జేయఁజాలక తదీయులగు రవిచంద్రేంద్రాదులను గాసిపెట్టుచున్నాఁడనుట నిది ప్రత్యనీకాలంకారమైనది.

## వ్యాఘాతాలంకారము

స్వరూపము:- 'ఒక వస్తువు ఏ యుపాయముచేత ఒకనిచే సాధింపఁ బడునో ఆ వస్తువే యాయుపాయముచేతనే మఱియొకనిచే వేఱుగా జేయఁబడునో వ్యాఘాతాలంకారమగును.'

సీసా: తన సుబాహువుచేతఁ దనరారఁ జేసెను
ధరను బాహువు భంగపడు మఖము
నిజరజో మహిమచే నెలఁతగా వశిఁజేసె
అలరజో మహిమ రాయైన చెలువ
ఉగ్ర ధనువుఁబట్టి యుజ్జీవితునిఁజేసె
ఉగ్ర ధనువునఁ బాటొందు ధరుని
వరశౌర్యమున ఖ్యాతి వదలిపోవఁగఁజేసె
వరశౌర్య విఖ్యాతుఁ బరశురాము
చిత్రములకెల్ల చిత్రంబు చిత్రచరిత!
స్వాదువులకెల్ల స్వాదువు నీదుచరిత!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- సుబాహువుచేత భంగమునొందిన మఖమును శ్రీరాముఁ డంమ్రిఁడు సుబాహువుచేతనే నిర్విఘ్నముగ సమాప్తినొందించెను. గావున నిది వ్యాఘాతాలంకారమైనది. ఇట్లే తక్కిన వాక్యముల లోను ఈ అలంకార సమన్వయము తెలియఁగునది.

## ప్రతీపాలంకారము

స్వరూపము:- 'ఉపమేయము చేతనే యుపమానకార్యము సిద్ధింప సిరి ఉపమానమేల? యను ఆక్షేపము గలిగినను; ఉపమానముగా ప్రసిద్ధమైనదానిని ఉపమేయముగా వర్ణించినను ప్రతీపాలంకారమగును.'

ఉదా:-

అనమానధీరుఁడీ యవనిజాపతియుండ
    ఏల మేరువటంచు మూలనెట్టె;
సత్కళానిధి రామచంద్రుండు దైవాఱ
    ఏల రేవెల్గని వ్రేలఁగట్టె;
దాన ధౌరేయుఁడీ జానకీపతిగల్గ
    ఏలవిన్నాణిని పాలువెట్టె;
సర్వధూర్వహ బాహు సాకేత విభుఁడుండ
    ఏల శేషుండని నేలఁబెట్టె;
ఏలపడి? యొక్కఁడీ యిలఁజాలుననుచు
అమలధీనిధి యాచతురాననుండు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ధీరత, ఆహ్లాదకరత్వము, వితరణ, ధౌరంధర్యము అను నవి రామచంద్రునికడనే యుండఁగ నిఁక మేరుచంద్రాదులేలయని ఆక్షేపము వచ్చినది. కావున నిది ప్రతీపము. రామచంద్రుఁడు ప్రకృతము. మేర్వాదులు అప్రకృతములు.

## సూక్ష్మాలంకారము

స్వరూపము:- 'అసంలక్షితమైన సూక్ష్మార్థమును ప్రకాశింపఁజేసిన సూక్ష్మాలంకారమగును.'

ఉదా:- అత్తవారి కులము నడిగిన సఖులెల్ల
కనుదమ్మి విరియించి గాంచులీల
మామగారెవరన్న కామినీతిలకంబు
పదిముత్తియములను వరుసనిలుపు
భర్త పేరడుగఁగా పల్లవాధర యభి
రామకీరమువంక రహిఁ జూచు
చూచుచుండఁగనే శోభన తనువల్లి
పులకప్రసూనాలఁ బొలుపుమీఱ
ఇదిగో! పూచెను; ఫలముల నింకగాయు
నంచు చెలులాడఁ దలవాల్చె నవనిజాత
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- అత్తవారి కులమేమని యడుగ లజ్జగావున చెప్పలేక సీత లీలతోఁ కనుదమ్మి విరియించి చూచినది. తమ్ములు విరియింపు వాఁడు సూర్యుఁడు. కావున మా యత్తవారికులము సూర్యకులమని సీత చెప్పక చెప్పిన సూక్ష్మార్థమును చెలులు గ్రహించిరి. కాన ఇది సూక్ష్మాలంకారమైనది. ఇందలి తక్కిన సూక్ష్మార్థములను నిట్లే గ్రహించునది.

# ప్రౌఢోక్త్యలంకారము

స్వరూపము:- 'ఒక వస్తువునందు గుణాధిక్యమును నిరూపింపఁదలఁచి యా గుణములుగల యితర ప్రసిద్ధవస్తువులతో దానికి సంసర్గ మును వర్ణించిన ప్రౌఢోక్తి యగును.

ఉదా:- జట్టుజట్టులుగట్టి జెట్టీలు దేవదా
నవులుఁ జేపట్టి మందరముఁ వడిని
పాలకడలిఁ జిల్కి పరిభవ మొందిన సుధా
శీకరంబులలోనఁ జేర్చి కూర్చి
అమలౌషధీసార మందుపొందిక నూరి
పొంగువెన్నెల లోన రంగరించి
మించులు జల్లించి మెత్తని పొడిచేసి
పొదిపి యద్దాని తోఁ బదునుచేసి
కాంక్ష సృష్టించె నీ కటాక్షములు ధాత
ఆశ్రితావనశీల! కృపాలవాల!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- భగవత్కటాక్షములు అమృతశీకరములతోఁ జేయఁ బడినవి. వానియందు అమృతగుణములగు సంజీవనాదులేగాదు. జన వశీకరణము, ఆహ్లాదము, సౌందర్యము, మొదలగు ఉత్కృష్టగుణ ములు పెక్కుగలవని నిరూపించుటకు ఆ కటాక్షములకు జనవశీకరణాది గుణములుగల ఓషధీసారము, వెన్నెల మున్నగువాని సంసర్గము వర్ణిం పఁబడినది. కావున నిది ప్రౌఢోక్తియైనది.

## లలితాలంకారము

స్వరూపము:- 'వర్ణ్యమునకు దాని వ్యవహారమును వచింపకయే అప్రకృత వ్యవహార సంబంధమును జెప్పిన లలితాలంకారము.'

ఉదా:- త్రిపురదాహన మహాతీవ్ర ఫాలాక్షుని
పరిధనమం దెదిరించు రాముఁడేడ
ఆహవిర్భోక్త లనాహవమ్మునఁ దాఁకు
పేఁక వెలుఁగు నీ పీకులేడ
బ్రహ్మాండమును భస్మపటలంబు గావింప
దీర్ఘ జిహ్వాలు సాఁచి తీవరించు
ప్రళయోగ్రవహ్నిని పద్మమర్దన కేళి
చణమని ప్రాలేయ జలముచల్లి
ఆర్పనెంతువు ; రావణా! యసురనాథ!
యందురఁట వాని యాప్తులో యమరమిత్రి!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- కుంభకర్ణాదులు వారును వారును జెట్టు హవిస్సుతో బ్రదుకు దేవతలపై దూఁకగలవారు. అట్టి వారితో జగదేకవీరుఁడగు రాముని దాఁక గోరుచున్నాఁడు రావణుఁడు. ఇట ప్రకృత వస్తువు రావణుఁడు. వాని యిచ్ఛానురూపమగు వ్యవహారమును జెప్పకయే అప్రకృతమగు మంచునీటితో ప్రళయాగ్నిని చల్లార్చుట యను వ్యవహార సంబంధము చెప్పఁబడినది. కావున నిది లలితమైనది.
ప్రకృతముకూడ చెప్పఁబడిన నిదర్శనాలంకారమేయగును.

## ప్రహర్షణాలంకారము

స్వరూపము:— 'ఆయా ప్రయోజనములకై సాక్షాత్తుగా ప్రయత్నము సలుపకయే ఇష్టప్రాప్తి గలిగెనేని ప్రహర్షణమగును'

ఇవి మూఁడు విధములు:— ౧ తలవని తలంపుగా కోరికలీడేరుట.
౨ ఒకదానిని కోరి యత్నింప అంతకంటె ఎక్కువ లభించుట.
౩ అభీష్టవస్తుసాధనమునకై యత్నింప అభీష్టవస్తువే లభించుట

ఈ మూఁడింటిలో రెండవ భేదమునకు ఉదాహరణము:—

పిచ్చినవ్వుల నలవిచ్చికెమ్మోవి ప
లొగ్గల తళతళల్ పొలుపుమీఱ
వచ్చియురానియు బలు నలపల్కులు
బలుకరించెడి తీరు పరిఢవిల్ల
కాలూని నిలువఁగాఁ గాక నేలను బ్రాకి
కాయమ్ము దుమ్ము బుక్కాయినిండ
తను డాయవచ్చు నాతనయునిఁ గోరి పు
త్రేష్టిఁజేయు దశరథేశుఁడొకఁ!
పొందె పురుషోత్తముని నిన్ను పుత్రుఁగాఁగ
కొసరు గానీదు తమ్ములఁ గూర్మిసుతుల
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:— మక్కువదీర్పనొక కుమారునిగోరి పుత్రేష్టిఁజేసిన దశరథునకు జగదభిరాముఁడగు శ్రీరాముఁడును తదనురూపులగు లక్ష్మణాదులును లభించిరి. ఇట దశరథుఁడు వాంఛించినదానికంటె అధికఫల ప్రాప్తిగలుగుట నిది ప్రహర్షణమైనది.

## విషాదనాలంకారము

స్వరూపము:- అభీష్టార్థమునకు విరుద్ధమైన యర్థము లభించిన విషాదనాలంకారమగును.

ఉదా:- మాటాడ కేనేను మౌనంబుదాల్చుచో
వెడలిపోదురు జనుల్ విసికి, యంత
గట్టిగా ముక్కుతోఁబట్టి గడియఁదీసి
ఈ పంజరమునుండి యెగిరిపోయి
చేరి శారికఁగూడి స్వేచ్ఛగా మామిళ్ళ
మీఁదనే విహరించి మెఱయుదాన
అంచు కీరంబు భావామృతంబానుచు
పొంగుచుండఁగ నొక్క భుజగమందు
దూరె నాకార! విధినేత లేరుపఱపఁ
జాలు వారెంద ఱున్నారు! జగతి దేవ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- ఇట కీరమునకు పంజరవిముక్తి యిష్టము. తద్విరుద్ధముగ సర్పగ్రహణము గలిగినది. కావున నిది విషాదనము.
ఇది యనర్థోత్పత్తిరూపమగు విషమాలంకారముకాదు. దీనికి భేద మిది: ఇష్టార్థప్రాప్తికై ఒకానొక కారణము ప్రయోగింపఁబడి తన్మూలమున అనర్థోత్పత్తి గలిగిన విషమము. అట్టి కారణము ప్రయోగింపఁబడకయే వేఱు కారణమున అనిష్టప్రాప్తి గలిగిన విషాదనము.

## ఉల్లాసాలంకారము

స్వరూపము:- 'ఒకదాని గుణదోషముల సంగతిచే వేఱొకదానికి గుణదోషములు గల్గెనని చెప్పిన ఉల్లాసాలంకారమగును.'

ఉదా:-

ఏయది సతతంబు హింసాప్రధానులౌ
 పాపరాక్షసులకు భవనమగుట
అపవిత్రమయ్యెఁదా నార్యసంస్థితి కట్టి
 వింధ్యాచలప్రాంత విపినభూమి
మంగళరామాంఘ్రి మహనీయ ధూళులు
 పర్వి పవిత్రమై వఱలెనౌర!
భాసిల్లు నార్యనివాసమై శుభవనమై
 కమ్మని హోమ ధూమమ్ము మలయ
ఎట్టి శక్తులుగలవో! సర్వేశ్వరునకు
నంచు భక్తులు నినుగొల్తు రెంచిమదిని
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇందు పాపులగు రాక్షసుల సంసర్గమున వింధ్యవనము అపవిత్రమగుట దోషసంసర్గమున వచ్చు దోషమునకు ఉదాహరణము. పవిత్రమైన రామపాద సంసర్గమున ఆ వనము పవిత్రమగుట గుణసంసర్గమునఁ గల్గు గుణమునకు ఉదాహరణము. కావున నిది ఉల్లాసము.

## అవజ్ఞాలంకారము

స్వరూపము:- 'ఒక వస్తువునకు అన్యవస్తు సంసర్గము వలనఁ గాని గుణదోషములు సంక్రమింపనిచో అవజ్ఞాలంకారము.'

ఉదా:- జపతపంబు లుచితసత్క్రియాకాండము
చేయఁజేసెనీ కర్తవీరుఁడయ్యె
సర్వవేదాంత నిష్ణాతుఁడయ్యెను వసిష్ఠ
జనకుఁడు గాఁడు విరాగి జగతినెంచ
శీలమును కలుగాఁగఁదాను వారాన్నిధి
గర్భంబు లోనుండఁగల్గి కూడ
మాఱక, పొందక మార్దవం బిసుమంత
మెఱయు నామైనాక గిరినిఁబోలి
లసిత మంజులత్ర్యంత ! యసురహంత !
కలిత సుస్వాంత ! భక్తకోకిల వసంత !
రమ్యగుణధామ ! సజ్జనారామసీమ !
విశ్వనుతనామ ! గోపాలపేటరామ !

సమన్వయము:- ఇట్టి జపతపాదులు వేదాంతచర్చలు అనువాని సంసర్గము ఖలునకుఁగలదు. అయినను వాని గుణమగు వైరాగ్యము ఈ ఖలునకు సంక్రమింపలేదు. కావున నిది అవజ్ఞాలంకారమైనది.

## అనుజ్ఞాలంకారము

**స్వరూపము:-** 'అందున్న యొకానొక ఉత్కృష్ట గుణమునందలి లాలసతో నికృష్టమని ప్రసిద్ధమైనను ఆ వస్తువునే ప్రార్థించుట అనుజ్ఞాలంకారమగును.'

**ఉదా:-**

వలదు రాజ్యము భోగభాగ్యముల్ పనిలేదు
అఖిలాప వర్గ సౌఖ్యంబునలదు
పరిణతాహంకృతి పార్థివాగ్రజాతులఁ
బరిభవమొందెదునట్టి వాంఛలేదు
అంజలిబట్టి నిన్నర్థింతు నిదియొండు
వేఱొక్కటియు నిన్ను వేడరాను
అమలగోవింద పాదారవిందామృతా
స్వాదనిత్యశ్రీల వఱలుచుండు
ఒక్కహోలికునింట నా కుదయమొంద
వరము దయసేయవే చాలు వరద! దేవ!
రమ్యగుణధామ! సజ్జనారామసోమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

**సమన్వయము:-** 'హరిభక్తి' యను ఉత్కృష్ట గుణమునందలి లాలసతో నికృష్టమైనదయ్యు హోలిక గృహప్రభవము ఒక భక్తునిచే ప్రార్థింపఁబడినది. కావున నిది అవజ్ఞాలంకారమైనది.

## తిరస్కారాలంకారము

స్వరూపము:- 'ఏదియో యొక దోషము చూపట్టినంత, గుణవిశిష్టము ప్రసిద్ధిగాంచిన వస్తువునుకూడ ద్వేషించుట తిరస్కారము.'

ఉదా:-

మదదంతి గండాగ్ర మదఝరీ సౌరభ్య
మోది షట్పదగీతి నాదితములు
కుటిలాలకోన్నిద్ర కువలయమాలికా
పరిభటాపాంగ విభాసురములు
అసమానవీరతా హంకార పరిణతీ
కోచిత ప్రసారణ భూషితములు
వందిమాగధ బృంద వాచాలతా దివ్య
వల్లరీ సుమరజో వాసితములు
శ్రీలు వలదన్న, యెవ్వాని చెలిమి గలుగ
వీలు గలుగదు హరిసేవ ప్రేమఁజేయ
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- సంపదలు అహంకారయుక్తము గాట హరిసేవ చేయుటకు ప్రతిబంధకములు అను దోషమును మదినెంచి భక్తుఁడు సౌఖ్యాది గుణవిశిష్టములై వాంఛనీయములైన సంపదలను వద్దని ద్వేషించుచున్నాఁడు. కావున నిది తిరస్కారము.

## లేశాలంకారము

స్వరూపము:- 'గుణమే యాపదకు హేతువగుట తలంచినప్పుడు ఆ గుణమును దోషముగను, దోషముకూడ ప్రయోజన కారియైనప్పుడు దానిని గుణముగను వర్ణించిన లేశాలంకారమగును.'

ఉదా:- మాధవచరణాబ్జ మకరందసారమై
అమరభూములు పావనములు సేసి
పరితప్త మర్త్యాళి పాపముల్ వాపఁగా
ప్రాలేయగిరిపైనఁ గాలువెట్టి
చంద్రశేఖరజటా జాల వాగురికలోఁ
జిక్కుకొంటివి తల్లి స్వేచ్ఛదొలఁగి
ఈ ముప్పునకు హేతు వితరులెవ్వరుగారు
నీగుణదోషమే నిజము జనని
లోభమునుగల్గఁ జేయు నిర్లోభులకును
వానిమహిమలు గాన నాపదలు వచ్చు;
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- సకలశ్రేయస్సాధనములు మందాకినీ మహిత గుణములు. ఆ సుగుణములే ఆ తల్లికి శివజటాజూట బంధనమునకు కారణమగుట దుష్టములుగ నిర్దేశింపఁబడుట నిది లేశము.

## తద్గుణాలంకారము

స్వరూపము:- 'దుర్బల నిజగుణ త్యాగపూర్వకమైన ప్రబల పరగుణస్వీకారము వర్ణింపఁబడిన తద్గుణాలంకారమగును'

ఉదా:- కిసలయాంగుళిసీత కెందమ్మిదోసిటఁ
బద్మరాగరుచులఁ బరిఢవిల్లి
అరుణాన్వయ విభూషు నపరంజి తలపాఁగ
బంగారు పూవుల ప్రభదలిర్చి
శ్యామలంబైన శ్రీరాము మేనునజారి
ఇంద్ర నీలప్రభ నెసఁగిమెసఁగి
చిత్రరత్నద్యుతుల్ చెన్నొందు వేదికఁ
జిత్రపుష్పాకృతి శ్రీలఁదనరి
భాసురములైన మీపెండ్లి సేసఁబ్రాలు
శ్రీలఁ దేలించి లోకాల నేలఁజాలు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- సీతారాముల పెండ్లిలో నొకరిపైనొకరు పోసికొనిన సేసఁబ్రాలు తెల్లని తమ గుణమును వీడి తాము పడిన ఆయాప్రదేశముల గుణములను స్వీకరించినవనుట నిది తద్గుణాలంకారము.

గమనిక:- తద్గుణ, సామాన్య, మీలనాలంకారములు ఒకటిగాఁ జూపట్టును. వీని భేదమిట్లు గుర్తింపనది :—

౧. భిన్నగుణములైన రెండు వస్తువులుండి యందొకటి యధికబలమగు మఱియొకదాని గుణము స్వీకరించిన తద్గుణము.

౨. సమానగుణమున్ననే అన్యగుణాచ్ఛాదము గలిగింపునది సామాన్యము.

3. గుణముతో పనిలేకయే వస్తువుతో వస్తుతిరోధానము గలిగిన మీలనము.

## అతద్గుణాలంకారము

స్వరూపము:- 'తగినంత కారణమున్నను పరగుణ స్వీకారము చేయనిచో అతద్గుణాలంకారమగును.'

ఉదా:- మందోదరీసతి మధుర వాగ్వీచికల్
పైపైనఁ బలుమారు పర్వఁగనియు
కైలాసగిరివాసు మేలిప్రసాదపు
నిండారు ఘుమఘుమ నింపఁబడియు
ఆమ్నాయవారిద మమృత ధారలుచిమ్మి
ముంచియెత్తఁగఁ దాను ముంపఁబడియు
అనుజన్ము ననునయ వ్యాహార మాధురి
మాటిమాటికి మీఁద మలయమనియు
చేదువిఱుగదు; తియ్యనగాదు, కాదె?
రావణాసురు తలఁపౌర! రామచంద్ర!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- మధురాతి మధురములైన యనేక వస్తువుల సంసర్గమున్నను రావణుని భావము తన చేదుతనమును విడువలేదనుట నిది అతద్గుణాలంకారమైనది.

## మీలనాలంకారము

స్వరూపము:- "ఒక వస్తువుచే మఱియొక వస్తువు ఆచ్ఛాదితమయ్యేని మీలనాలంకారమగును"

ఉదా:-
చేర్చుక్కరతనాల చెన్నులన్నులమిన్న
మోముసొంపులలోన మునిఁగిపోయె
తాటంక ముత్యాల తళతళల్ చంద్రాస్య
చెక్కుటద్దాలలోఁ జేరిపోయె
నానామణీరుచుల్ భాసిల్లు బింబోష్ఠి
యధరకాంతులలోనె యణఁగిపోయె
బంగారు పేరుల రంగారు మిలమిలల్
మేలిసొరులలోన లీనమయ్యె
తొడవులకునెల్లఁ దొడవు మాపుడమిపట్టి
చోద్యమనిసీతఁ జూతురా సుదతులెల్ల
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఆభరణ ప్రభలు జానకి అవయవ సౌందర్యములో నిమీలితములైపోవుట నిది మీలనాలంకారమైనది.

# ఉదాత్తాలంకారము

స్వరూపము:- 'సమృద్ధవస్తు వర్ణనము ఉదాత్తాలంకారమగును'

ఉదా:- అఖిలవిజ్ఞాన దీప్తామల రూపులై
తనరారు విబుధరత్నంబులొకట
చటులవిక్రమకళా చండమార్తాండులై
దైవారు వీరరత్నంబులొకట
సౌందర్య సర్వస్వ సారైక మూర్తులై
తనరుస్త్రీజాతి రత్నంబులొకట
ఉత్తుంగ హేమ శృంగోజ్జ్వలాగ్రింబులై
తగుమహాసౌధ రత్నంబులొకట
ఎందుగసరత్నములె కనువిందు సేయఁ
దరమె వర్ణింప సాకేత పురసమృద్ధి
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేట రామ!

సమన్వయము:- శ్రీరామచంద్రుని రాజధానీ నగరసమృద్ధి వర్ణింపఁబడుట
నిది ఉదాత్తాలంకారమైనది.

# రసవదలంకారము

స్వరూపము:- 'ఒక రసము ప్రధానముగ మఱియొక రసమునకు అంగ మగునెడల రసవదలంకారమగును'

ఉదా:- కడురక్తిఁబులకెత్తఁ గల్పప్రసూనాలు
లీలమాలలుగట్టి మాళ్ళఁ జేర్చు
కస్తూరి నలుగడల్ గుస్తరింపఁగ విడె
మందిచ్చి యధరమ్మునంటినొక్కు
మలయజ పంకంబు నలఁదు నెపమున
హారాళిఁదీయఁగాఁ జేరవచ్చు
చెండి! మకరికల పిండు ద్రోలెదనని
వడి గండములు గూర్మిఁబుడుకఁదొడఁగు
ఆ కరమ్ములా! యివి; హా! రణాంగణమునఁ
బొరలుచున్నవి గ్రద్దలు పొడువ; నాథ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- రణభూమిని తెగిపడియున్న రావణుని గాంచి యాతని యిల్లాండ్రు విలపించు ప్రకరణమునఁ జెప్పినది యిది. ఇందు కరుణ రసము ప్రధానము. శృంగార రసము దానికి అంగమైనది గావున నిది రసవదలంకారమైనది.

## ప్రేయోలంకారము

స్వరూపము:- 'ప్రధానరసమునకు భావము అంగమగు నెడల ప్రేయో లంకారమగును.'

ఉదా:-

మంగళసరయూ తరంగిణీ శీకర
 శీతలవాతముల్ చెలగుచుండ
అశ్రీధారామాలి కాలంకృతాస్యుండు
 మారుతి పాదపద్మములు గొల్వ
పరతత్త్వ వేదులు బ్రహ్మవాదులు చిత్త
 మిగురెత్త నిజతత్త్వ మెంచుచుండ
శ్రుత్యర్థములువోలె సొంపైన పీఠాన
 వైదేహిరాములు వఱలుచుండ
నిలిచి నోరార రఘుపతీ! నీరజాక్ష!
యంచు నుతియించు భాగ్యము లమరునెపుడొ!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలవేట రామ!

సమన్వయము:- నిరస్తలౌకిక వృత్తుఁడగు నొక భక్తుఁడు సకల జగదభి రాముఁడగు శ్రీరామచంద్రుని సన్నిధాన మెప్పుడుగల్గునా! యని ఆ భగవత్పరిసర సన్నివేశములను మనమున భావించుచున్నాఁడు. ఇది శాంతరసము. దీనికి ఆ భగవంతుని నుతించు భాగ్యము లమరు నెపుడొ! అనుచో 'ఎపుడో' అను పదముతో సూచితమైన 'చింత' యను భావమూ అంగమైనది. కావున నిది ప్రేయోలంకారమైనది.

## ఊర్జస్విదలంకారము

స్వరూపము:-- 'ప్రధాన రసమునకు భావాభాస రసాభాసములు అం: ములయ్యేనేని ఊర్జస్విదలంకారమగును.'

ఉదా: పటురటత్త్రావక పటహాభాంకృతి వైరి
వీరకాండము గుండె వ్రీలిపోవ
ధూళిమోములుగప్పఁ దూల మైదీవెలు
కన్నీరుజాలులు కాల్వగట్ట
ఆర్పులూర్పులు రేఁగ నధరమ్ములెండఁగఁ
బర్వెత్తునాదాయ పడఁతిగముల
దోఁచుకోవచ్చిన దొంగకిరాతులు
కదలు నవ్వారి పైయ్యెదలుగాంచి
తెళుకుతెళుకను వాలు చూపులనుగాంచి
మాఁగినువడినిల్చి రట్టులే మఱచిజగము
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇట ప్రధానరసము కరుణము. దానికి శృంగా: సాభాసము అంగమగుట నిది ఊర్జస్విదలంకారమైనది. అనుచితాలంబనము గావున నిట శృంగారము ఆభాసమైనదని భావము.

## సమాహితాలంకారము

స్వరూపము:- 'భావశాంతి రసాంగమైనయెడల సమాహితాలంకారమగును.'

ఉదా:- రాకేందుబింబమా! శ్రీకాంతుఁడీతఁడు;
రాగ శ్రీకడకె యూరేఁగవచ్చు!
రమణిరో! వసుమతీ రమణుఁడే యీతఁడు;
తన వసుమతిఁజూడఁ దరలఁదగును!
చంద్రాస్య! సితకీర్తి చంద్రికాలసితుఁడే;
చంద్రిక కేకేలు సాఁచనిమ్ము!
మానినీ! జానకీ జానియే, సీతా వి
నోదియే, వైదేహి మోది యితఁడు
శివుని వింటిని విఱచిన చేయి యిదిగో!
చూడు! మనఁ గొంటె చెలికత్తె; సొగసుమిన్న
సీత మోమున చిఱునవ్వు చెంగలించె
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము: నూతన వధువు సీతకు ప్రణయకోపము వచ్చినది. శ్రీరాముఁడును వాచబిడ్డఁడు. ఒకరికొకరు తీసిపోరు. ఆ స్థితిలో చెలికత్తె సీతతో 'ఈతఁడు శ్రీకాంతుఁడు' అనెను అనఁగా నీవు లక్ష్మివి; నీకు ప్రియుఁడు అను అభిప్రాయము. సీత శ్రీని ఒక నాయికనుగాఁ దలచి 'అక్కడికే యూరేఁగు' మనెను. ఇట్లు చమత్కార సంభాషణముతో పనిగాదని దాసి వాచ్యముగా ఈతఁడు సీతాపతియని రెట్టించి 'ఇదిగో! నీ కొఱకు శివుని విల్లుకూడ విఱచిన చేయి చూడుకొనుమని డాయఁజేసినది. ఆ గడ్డరితనమునకు సీత చిఱునవ్వునవ్వినది. అనఁగా ప్రణయ కోపభావము శాంతించినదనినమాట. ఆ భావశాంతి శృంగార రసాంగముగుట నిది సమాహితమైనదని తాత్పర్యము.

## భావోదయాలంకారము

స్వరూ. ము:- భావోదయము అన్యాంగమగునేని భావోదయాలంకారమగును.

ఉదా:
అంగనామణీ! యీతఁడంగాధిపతి ముద్దు
పట్టియానంగ విన వట్టి జరిగె
అంభోజ వదనరో! కాంభోజుఁడీ రాజు
మోమునూరాడఁ బెడ మోము వెట్టె
కామినీ రత్నమా! కాని రూపేంద్రుని
పుత్రుఁడేయనం గేంటబులను తిప్పె
భాసురగాత్రి! యీ కోసలనాథు సూ
నుం జూడుమనంగ నారసాక్షి
నాడంగోరియుం గన్నెత్తి చూడలేక
నిలిచెఁ దలవాల్చి గీఱుచు నేల సీత
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతినామ! గోపాలవేలరామ!

సమన్వయము:- నానారాజ కుమారుల చిత్రపటములను కుమారియగు జానకికి చెలికత్తె చూపుచుండెను. ఒక్కొక్క రాజకుమారుని పటము చూచుట మానివైచుట మెడ మోము పెట్టుటయు జరుగుచుండెను. ఇంతలో నెచ్చెలి ఈతఁడు కోసలరాజు కుమారుఁడు శ్రీరామచంద్రుఁడనెను. సీతకు కను దమ్ములు విరిసినవి. పటమును చూడఁబోయినది. లజ్జ కనులెత్తనీయలేదు. తలవాల్చి నిల్చినది. ఇందు సీతకు లజ్జయను భావము ఉదయించినది. ఇది రామవిషయిక రతికి అంగము గావున నిది భావోదయాలంకారమైనది.

## భావసంధ్యలంకారము

స్వరూపము:- 'విరుద్ధములగు రెండుభావములకు సమావేశము గలిగిన భావ సంధ్యలంకారమగును.'

ఉదా:- ఈ రెండుగాఁ దోఁచు వీర తేజంబును
నిలిచిన యొఁతీరు నిబ్బరంబు
అచ్చుగుద్దిన మేటి యాభిజాత్యంబును
విమలగుణంబుల కొమరుతళ్కును
దోబూచులాడెడి తొలిజవ్వనపు పొంగు
ముసిముసి నవ్వుల మోముసౌరు
అపురూపమైనయా యందచందమ్ములు
చూపులో దీపించు చురుకుదనము
వెలయు రామునిపై సీత కిలికిసులు
విరిసిపడి సర్వమంతలో మఱలివచ్చు
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతినామ! గోపాలపేటరామ!

సమన్వయము:- జగన్మంగళ విగ్రహుఁడగు శ్రీరామచంద్రుఁడు శివ ధనుర్భంగము చేసి నిలుచుండెను. సీతకు కనులార ప్రియునిఁ జూడ వలయునను ఔత్సుక్యము ఒకవైపున, కన్యా సహజమగు లజ్జ యొక వైపున పొడమినవి. విరుద్ధములగు ఈ రెండు భావములకు సమావేశము గలిగినది. కావున నిది భావసంధ్యలంకారము.

## భావశబలతాలంకారము

లక్షణము:- 'అనేక భావములు ఒండొంటితో కలసి కొనుట పొడమిన భావశబలతయగును. ఆ భావశబలత పరాంగమైన భావశబలతాలంకారమగును.'

ఉదా:- మంజులాధర చూసి కుంజమ్ములోఁ బ్రేమ
దగఁ గౌఁగిలింపఁగా దాఁగెనేమొ!
ఇచ్చోటగా! కనులింతింతలుగఁ జేసి
యింతెనాదారుల కెదురుచూచు
ఏణాక్షి వనసీమ నేమైనదో? లేమ
చుట్టాలకే మోము చూపు టెట్టుల?
రాజవదన లేని రాజ్యమేగాను ప్రా
ణంబు పోవాకు వలదు వలదు
అంచు సీతను వెదకి నిక్క గాంచి కరఁగి
వ్రాలు విలపించె; వీరైక వహ్రిలుజాలి
రమ్యగుణధాము! సజ్జనారామసీమ!
విశ్వనుతనాము! గోపాలసేవరాము!

సమన్వయము:- సీతాపహరణమునకుఁ బిమ్మట ఆమెనన్వేషించు శ్రీరామచంద్రుని హృదయస్థితి యిట వర్ణితము. ఇట 'తన్ను బరీక్షింప దాఁగినదేమో!' యని వితర్కము; ఇచ్చోటు...గా ఎదురులు చూచు' అని స్మృతి; ఏణాక్షి యేమైనదో! యని విషాదము; ఆమె చుట్టాలకు మోమెట్లు చూపుదును? అని లజ్జ; 'ప్రాణము పోవద్దని' నిర్వేదము; అను వివిధభావము లొండొంటితో గలుపుట నిట భావశబలత. ఇది కరుణరసాంగమై యిట భావశబలతాలంకారమైనది.

## సంసృష్ట్యలంకారము

స్వరూపము:- 'తిలతండుల న్యాయమున గలిసిన అలంకారముల పరస్పర సమావేశము సంసృష్టియనబడును.'

ఉదా:

రుచిఘనాఘనరుచి రుచిరాంగుఁడీ రాజు
రాజన్య రాశిని రోజ మొనయ
కుంఠిత దశకంఠ కంఠకుంఠనమునో
త్కంఠ కంఠీరవ కాన్తి తులెనఁగ
ఈ క్షుద్ర రాక్షస పక్ష విక్షేపదక్షు
క్షమ్ము లీక్షణములో క్షయముగావి
తుండతుండములుగా ఖండితముగ్గండ
ఖండనమ్మున శత్రుకాండమిదిగో!
అంచు వానరభటు లాజివార్చి నిలువ
దానవానీకమంతయుఁ దల్లడిల్లె
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- 'తుండతుండ,' 'ఘనఘన,' 'రుచిరుచి,' 'కంఠ కంఠ,' అనుచో ఛేకానుప్రాసము; ఇక యక్షరము వలనే అనన్యదావృత్తి గలిగిన తక్కిన మొదల వృత్త్యనుప్రాసము వను శబ్దాలంకారములకిట సమావేశము గలుగుట విది సంసృష్టియైనది.

## సమ్మేళనాలంకారము

స్వరూపము.- 'క్షీర నీరన్యాయమున గలిగిన యలంకార సమావేశము సమ్మేళనమనఁబడును.' దీనినే సంకరాలంకారమందురు.

ఉదా:- అరుణభుజా కిరణాగ్రి నారమ్మున
నసురాంధ కారమ్ము నణఁచివైచి
స్వీయానురాగ సంస్కృతిఁబంచి జగమున
ననురాగ రాగమ్ము లలమిమించి
నిజదీప్తి విలసన నిరతిసన్మఖపద్మ
ములకు శోభలుగూర్చి వెలయఁజేసి
సన్మార్గవర్తియై జనరంజకత లోక
మింత్రివిఖ్యాతిని మెఱసిమిగుల
రహిగ జోదయ గిరిసీమ రాణవెల్గు
భాస్కరునిఁబోలి శ్రీరామభద్రుఁడదిగో!
రమ్యగుణధామ! సజ్జనారామసీమ!
విశ్వనుతనామ! గోపాలపేటరామ!

సమన్వయము:- ఇట రూపకమునను ఉపమయును శ్లేషయును క్షీర నీరములవలె విడదీయరాని విధమున సమావేశము గలుగుట నిది సమ్మేళనమైనది.



" మంగళం కోసలేంద్రాయ | మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ | సార్వభౌమాయ మంగళమ్ "

శ్రీ శ్రీ శ్రీ